ఈకావ్యమునఁ బదమునందుఁ గాని, రసమునందుఁ గాని యనౌచిత్యము నందున నైనను గానరాదు. మానవజీవితము కవితయందుఁ బ్రతిబింబింపవలెననియుఁ, గవిత మానవజీవితవిమర్శాత్మకముగా నుండవలె ననియు ననునిట్టి పాశ్చాత్యవిమర్శవిధానముం బట్టి సమాలోచనముం జేయుచో హంససందేశమునఁ దల్లక్షణలోపము గానఁబడియెడిని. కాని ప్రాచ్యవిమర్శసూత్రములం బట్టి పరిశీలించినచో నీకావ్యము సంస్కృతిసారస్వతమున నత్యున్నతపదము నలంకరించుననుటకు సందియము లేదు. ప్రతిశ్లోకము ననర్ఘరత్నము; కావ్యమంతయు లోకోత్తరరత్నావళి.*

1. శ్లో. వంశే జాత స్సవితు రఘో మానయ న్మానుషత్వం
దేవః శ్రీమా న్జనకతనయా న్వేషణే జాగరూకః
ప్రత్యాయాతే పవనతనయే నిశ్చితార్థ స్సకామీ
కల్పాకారాం కథమపి నిశా మావిభాతం విషేహే. I స. 1 శ్లో.

4. శ్లో. సామే దృష్టి శ్శఫరనయనా సన్నతభ్రూస్సుకేశీ
తన్వీతజ్జ స్తనభరనతా తప్తజాంబూనదాభా
బాలా యుష్మ త్ప్రతిమగమనా వేదిమధ్యా వరాంగీ
శృంగారాఖ్యం నిధిమధిగతా శ్రేయసీ దేవతేవ. II స. 10 శ్లో.

5. శ్లో. విద్యాశిల్పప్రగుణమనసా వేంకటేశేన క్లుప్తం
చింతాశాణోల్లిఖితమసకృ చ్ఛ్రేయసాం ప్రాప్తిహేతుం
సీతాహంసవ్యతికరసఖం రామసందేశరత్నం
పశ్యం త్వంతశ్శ్రవణమసకుం చక్షురుజ్జీవ్యసంతః." II. 50.

LV. *హంససందేశము:—57. (ప్రాకృతభాషాత్మకము.):- వారణాసిధర్మసూరి. (58) ఈవిద్వత్కవిమద్ధర్మసీపారదృశ్వుఁడు; మహామహోపాధ్యాయబిరుదాభిరాముఁడు; ఆలంకారికచూడామణి; శ్రీరామచంద్రచరణసారసచంచరీకుఁడు. ఇతఁడు నరాంకితముగఁ బ్రతాపరుద్రీయమును రచించిన విద్యానాథమహాకవిని నిరసించి, శ్రీరామచంద్రయశోఘనసారసురభీకృత మగు i. 'సాహిత్యరత్నా

57. ధర్మసూరినిర్మిత "సాహిత్యరత్నాకరో"ద్ధృతము.

(58.) ధర్మసూరిని,దన్నిర్మితగ్రంథములం గూర్చి,తు.యువసంవత్సరాంధ్రపత్త్రికా సంవత్సరాది సంచికలోని శ్రీరంగము సోమేశ్వరశాస్త్రిగారి "సాహిత్యరత్నాకర"మను వ్యాసము, "ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక" [XVII సం. 6 సంచిక] లోని మదీయ "సాహిత్యరత్నాకర-నాకామన్దర" విమర్శవ్యాసముం జూచునది.

కరమైన(59)నలంకారగ్రంథమునురచించిధన్యుఁడయ్యెను. ఇతని గ్రంథములలో ii. 'నరకాసురవిజయవ్యాయోగము' ముద్రింపఁబడెను. iii. బాలభాగవతము (కావ్యము) iv. కంసవధ. v. కృష్ణాస్తుతి. vi. రవిశతకము. vii. హంససందేశము. ఈగ్రంథములైదును గాలగర్భమున నంతరించినవి. కాని వీనియందలి శ్లోకములు గొన్ని 'సాహిత్యరత్నాకరమున నుదాహరింపఁబడినవి. 'హంససందేశము' నుండి యొక్క శ్లోకము మాత్ర ముదాహరింపఁబడెను.

“జాగరో యథావా, మమైవ ప్రాకృతవిరచితే హంససందేశే.”

శ్లో. జాఅం సీఆణఅణజుఅళం లోహిఅం జాఅరాఅ
కిం వాతమ్మం మఅణదహణజ్జాలాహిదావా
చిత్తారద్ధేసురఅవిహవే చుంబణాణం పభేఏ
రత్తం కిం వా రహువఇముహే వీడిఆరాఅజోఆ.

ఛాయ:-శ్లో. జాతం సీతానయనయుగలం లోహితం జాగరాద్వా
కింవా తామ్రం మదనదహనజ్వాలజ్వాలాభితాపాత్
చిత్తారబ్ధే సురతవిభవే చుంబనానాం ప్రభేదే
కింవా రక్తం రఘుపతిముఖే వీటికారాగయోగాత్.

[X రసతరంగము. 16 శ్లో. 346 పు. తెలుఁగు ప్రతి; 353 పు. బమ్రాలోఁ బ్రకటితమైన నాగరీప్రతి.]*

LVI హంససందేశము:—60. భట్టవామనకృతము.

శప్తుఁ డగునొకయక్షుఁడు తనప్రియురాలియొద్దకు హంసను దూతగాఁ బంపుటయిందలియితివృత్తము. ఇది కాళిదాసమేఘసందేశమునకుఁ బ్రతిబింబము.

*ఈహంససందేశప్రణేత గద్యకవిసార్వభౌముఁ డగువామనభట్టబాణుఁ డనియు, నీక్రిందివి తత్ప్రణీతకృతు లనియు 'శృంగారశ్రీనాథము' న శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (78-79 పు.) వ్రాసియుండిరి.

i. వేమభూపాలచరిత మనునాఖ్యాయిక.
ii. రఘునాథాభ్యుదయము. [కావ్యము]
iii. నలాభ్యుదయము.

59. సరస్వతి తిరువేంగడాచార్యులవారిచేఁ, చెన్నపురి సరస్వతీనిలయముద్రాశాలలో ముద్రితము. 1871.

60. “D. C. S. MSS.” Volume XX, R. No. 11912. Page 7972.

iv. శబ్దరత్నాకరము. } నిఘంటువులు.
v. శబ్దచంద్రిక.
vi. పార్వతీపరిణయము. } రూపకములు.
vii. శృంగారభూషణము.
viii. హంససందేశము : ఖండకావ్యము.

నలాభ్యుదయగద్యము "ఇతి వామనభట్టబాణకృతౌ నలాభ్యుదయే" అనియున్నది. హంససందేశమునందలి గద్యము "ఇతి శ్రీభట్టవామనస్యకృతిః పూర్వో హంససందేశః సమాప్తః" అనియున్నది. 'శృంగారశ్రీనాథము'న వామనభట్టబాణ భట్టవామనుల యైక్యముగాని భిన్నత్వముగాని చర్చింపఁబడదయ్యె. చర్చించినతరువాతఁగాని వీరు భిన్నులా, కాదా యనుప్రశ్నము సమాధేయము కాఁజాలదు. హంససందేశకావ్యరత్నమునందలి కొన్నిమయూఖములఁ బ్రదర్శించెద:—కావ్యారంభము:—

1. శ్లో. సోఽహం యక్షో నియతవసతిః సౌమ్య కైలాసశైలే
నామ్నా దక్షో నలిననయనా సాచ కన్దర్పలేఖా
ఆజ్ఞాభఙ్గాత్ కుపితమనసా దత్తశాపోఽస్మి రాజ్ఞా
కామీ వర్షం కమపి వనితా విప్రయుక్తో వసేతి.

2. శ్లో. కాలే నస్యాన్నియతమియతా సాపునః కాతరాక్షీ
మ్లానచ్ఛాయా వనగజకరోపద్రుతా వల్లరీవ
ప్రత్యాశ్వస్తాం విరచయ సఖే తాం వచోభిర్మదీయైః
ధారై[రా]సారై రివ జలధరశ్చాతకీం తప్యమానామ్.

4. శ్లో. పూర్వం వాచాకలమధురయా శశ్వదామన్త్ర్య బంధూన్
పాథేయంచ ప్రకృతిమృదులం కల్పయిత్వా మృణాలీమ్
ధ్యాత్వా హంసం తవకులగురుం(తం)విరిఞ్చస్య వాహ్యం
శైలాదస్మాద్గగనపదవీ ముచ్ఛ్రితో రఞ్జిహీథాః.

కావ్యోపసంహారము:—

౬. శ్లో. సేయం దీర్ఘా విరహరజనీ హన్త కించిద్విభాతా
శాపస్యాంతః సకదిభవితా వాసరైః కైశ్చిదేవ
మాసా వేతా(గమయ)లదను ప్రాశ్య మోక్ష్యావహే తాన్
భోగా నిష్టాన్ రజఃషుపరం ప్రోషచ ద్రాతపాసు.

# ధాతుమాల.

ఈయాంధ్రధాతుమాలకు మూలమగు వ్రాతకాగితపుఁబ్రతి శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటుకార్యాలయమునఁ గల చిన్నయసూరిగారి లిఖితగ్రంథసముదయములో దొరకినది. ఇది చిన్నయసూరికృతమగునో కాదో సిద్ధాంతము చేయుటకుఁ దగిన ప్రబలాధారములు దొరకలేదు. మేమువినినంతవఱకు సూరిగారిచే రచియింపఁబడిన వీక్రిందిగ్రంథములై యున్నవి.

1. ఆంధ్రశబ్దశాసనము.
2 ఇంగ్లీషు లాచట్టముల భాషాంతరీకరణము.
3. చాటుపద్యములు.
4. రాణిగారిపట్టాభిషేకమునకు రచించినపద్యములు.
5. సంస్కృతబాలబోధ.
6. సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము (చిన్నయసూరీయము.)
7. ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య.
8. బాలవ్యాకరణము.
9. నీతిచంద్రిక.
10. శబ్దలక్షణసంగ్రహము.
11. అక్షరగుచ్ఛము.
12. పద్యాంధ్రవ్యాకరణము.
13. విభక్తిబోధిని.
14. అకారాదినిఘంటువు.
15. విశ్వనిఘంటువు.
16. సుజనరంజనీపత్రిక.
17. ఆదిపర్వవచనము.
18. పచ్చయ్యప్పగారిపైఁబద్యములు.

ఈగ్రంథమందు గ్రామ్యరూపములు పెక్కులు కానఁబడుచున్నవి దీనినిబట్టి యిది చిన్నయసూరికృతము కాదేమో యనిసంశయించుట కవకాశము గలదు. ఎట్లయినను దెనుఁగులో ధాతుపాఠ మింతదనుక లేదు కావున దీనిని బ్రకటించితిమి. ఇందలిగుణదోషములు విచారించుభారము పండితులదియై యున్నది.

దీనిపై విద్వాన్ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారి యభిప్రాయము వెనుకవైపునఁ బ్రకటింపఁబడినది.

వ. అ.

శ్రీసరస్వతీపరదేవతాయైనమః

# ధాతుమాల-పీఠిక.

ఈయాంధ్రధాతుమాలను లోకమునఁ బ్రకటించి యాంధ్రసాహిత్యపరి
షత్తు తనముఖ్యవిధి నొకదానిని నిర్వర్తించినది. సాధారణముగా గ్రంథనిబద్ధ
ములగుభాషల కెల్ల వ్యాకరణ ముండితీరును. ఏకాలమునం దేయేపదము
లు వాక్యములు నెట్టిపరిణామమును బొందినవో తెలుపుటయును బహుశిష్ట
జనవ్యవహారారూఢపదములు మాత్రమే ప్రయోగార్హము లని శాసించుటయే
వ్యాకరణముల ప్రయోజనము. ఎల్లబాసలందును దొలుదొల్తఁ బరిమితము
లగుక్రియాపదములు మాత్రమే యుండి యవసరముల ననుసరించి కాల
క్రమమున నితరపదములకూడికచే నపరిమితము లగు నని కొందఱు పండితు
లందురు. సంస్కృతభాషయందలి పదము లన్నియు ధాతుజన్యములే యని
పాణినీయవ్యాకరణమునందలి వ్యుత్పత్తిపక్షము దెల్పుచున్నది. తెనుఁగుభా
షయందలి కాలు చేయి కన్ను ముక్కు మొదలగుపదము లన్నియు ధాతుజన్య
ములే యని పలువురు పండితు లనుచున్నారు. కాని ధాతురూపములు నా
మములుగాఁ బరిణమించినవో నామములనుండి ధాతువులు జనించినవో నిర్ణ
యించుటమాత్ర మలవికానిపని. ఈసంశయ మాంధ్రభాషావిషయమున నత్య
ధికముగానే కలదు. నేను మేము నీవు మీరు వాఁడు వారు అను ద్వ్యక్షర
సర్వనామములందలి ద్వితీయావయవములే ప్రకృతక్రియావిభక్తులుగా నగపడు
చున్నవి. తొలుదొల్త ధాతువులకు విభక్తిప్రత్యయములు లేవనియు సర్వ
నామపదములే తత్తదర్థానుసారముగ ననుప్రయోగింపఁబడియెడి వనియుఁ
గాలక్రమమున నయ్యవి వర్ణలోపాదివికారములఁ బొంది విభక్తులుగా మాఱి
న వనియు నూహింప నగును. అయినను ధాతురూపములు మాత్ర మనాది
సిద్ధములై స్వతంత్రముగానే యున్నవి.

ఏభాషయం దైనను పాండిత్యమునకు ధాతురూపపరిజ్ఞానము పరమ
సాధనముగా నున్నది. అనేకశబ్దము లుపసర్గసాహచర్యమునను బ్రకరణవశ
మునను భిన్నార్థద్యోతకము లైనను రూపసాదృశ్యముంబట్టి యేకధాతుజన్య
ము లని నిర్ణయించుచున్నాము. ప్రహారాహారసంహారవిహారపరిహారము లిట్టి
వి. ధాతురూపపరిజ్ఞానము లేనిభాషాజ్ఞానము నేత్రహీన మగుశరీరముం

బోలి నిరర్థక మగుచున్నది. పరిమిత మగు [illegible] ధాతుకతిపయముతో నపరి
మితము నావశ్యకము నగుపదజాలమును సృష్టించికొనుట వ్యవహారసౌకర్య
ము గూర్చును. కావుననే ప్రాచీనపండితులు ధాతుమాలల రచించి యుం
డిరి. సంస్కృతమునకు ధాతుదళగణితలంగ [illegible] వర్ణింప నలవి కానిది
గదా! కర్ణాటభాషకు సైతము ధాతుపారాయణము గలదు. ఆంధ్రభాషకు లక్ష
ణముల రచించినవారు ప్రాచీనకవులు లనేకు లున్నను నీకీటుగా ధాతువుల నెల్ల
నేకసూత్రమున గుదిగ్రుచ్చి లోకమున కర్పించినయట్టి సుగృహీతనామధేయు
లగు శ్రీపరవస్తు చిన్నయసూరిగారు మాత్రమే. శ్రీసూరిగారిచే రచితగ్రంథము
లగునవి యాంధ్రు లెల్లరజిహ్వాగ్రములందు దాండవించుచునే యున్నవి. ప్రమా
ణమే కావిం దప్రమాణమే కాని యు బాలవ్యాకరణమునం బోలెం బటుతర మగు
నాంధ్రవ్యాకరణ మాంధ్రావనియం దింకొక్కటి కలదా? చిన్నపొత్తమే యైన
ను నీతిచంద్రికం బోలుప్రౌఢవచనకావ్యము వేఱొకటి లేదుగదా? ఈరెండు
గ్రంథములును శ్రీసూరిగారి కీర్తిలతికకు శాఖాద్వయమై యాంధ్రదేశ కాయ
మానమున నలముకొని యనశ్వరజ్ఞానఫలము నందించుచున్న వనుట యతిశ
యోక్తి కానేరదు. శ్రీసూరిగారిజీవితచరిత్ర మిదివఱ కీపరిషత్పత్రికయందే ప్ర
కటింపఁబడినది. అచ్చుపడిన నీతిచంద్రికాబాలవ్యాకరణములు కాక యము
ద్రిత మగునొకగొప్ప తెలుఁగునిఘంటువు సూరిగారు రచించినది శ్రీపీఠికాపుర
సంస్థానమునఁ గలదు. శబ్దరత్నాకరముకంటె నిది మిగులఁ బెద్దది. శబ్ద
రత్నాకరమున కిది మూలప్రాయ మైనదికూడను. శబ్దలక్షణసంగ్రహ మను
నొకముద్రితాంధ్రవ్యాకరణము సూరిగారు రచించినట్లు ప్రకటింపఁబడియున్నది
కాని యది వారిచే రచింపఁబడినది కాదని నేను కణుకుపరిషత్సభలో సిద్ధాం
తీకరించియున్నాఁడను. ఇట్లుండ నిపు డీధాతుమాల యొకటి సూరిగారిపేరు
మోసికొని లోకమున కవతరించినది. కావున దీనిఁ గలరూపించుక విమర్శింప
వలసియున్నది.

శ్రీసూరిగారు ధాతుమాల నొకదానిని రచించిన ట్లనేకు లెఱుంగరు.
ఈగ్రంథమునం దెక్కడను సూరిగారిపేరు లేదు. శ్రీసూరిగారిమతమునకు
విరుద్ధ మగు ననేక విషయము లిందుఁ గలవు. అలాక్షణికత్వమును నిరసించు
వారిలో సూరిగా రగ్రగణ్యు లనుట నిర్వివాదముగదా? అట్టిసూరిగారు గ్రా
మ్య రూపముల నుదాహరింతురా? ఒక వేళ స్వస్ప్రతిపత్తికై గ్రామ్యపద

ములతో నర్థనిరూపణము గావించినఁ గావింపవచ్చును గాని ధాతువులకే గ్రామ్యరూపముల నుదాహరించుట వానియర్థమును సంస్కృతమున నాంధ్రమున ను దెల్పుటయును శ్రీసూరిగారివంటి యభినివిష్టు లాచరింతురా? "ధాత్వాదులకు ధాత్వాదు లనుప్రయుక్తంబు లై విలక్షణార్థాభిధాయకంబు లగు నయ్యవి శబ్దపల్లవంబులు నాఁబడును." అని సూత్రించి సూరిగారు ఏగుదెంచు, చనుదెంచు, మేలుకొను, అందిమ్ము, చొత్తెంచు మొదలగురూపములను సాధించిరి. వీనియందవయవద్వయము వేర్వేఱ స్వతంత్రప్రయోగము గలదియే. ఈ గ్రంథమునందు అగపడు మొదలగురూపములను సమానధాతువులుగాఁ జేర్కొని అగపడులో అగకు వ్యస్తప్రయోగము లేదనుట సూరిగారిమతమునకు విరుద్ధముగాదా? సమానధాతుసంజ్ఞ సూరిగారిగ్రంథమునం దెక్కడ నగపడదు. సమానధాతువు లను సంజ్ఞాకరణమే దుష్టము. ప్రయోగారూఢము లగుదేశ్యధాతువులకు మాత్ర మర్థనిరూపణము రూపనిష్పత్తియుఁ గావించుట గ్రంథోద్దేశమయి యుండఁగా నిందు వ్యావహారికములఁగూడ నుదాహరించి యందుఁ గొన్నింటికి మాత్రము గ్రామ్యము లని "గ్రా" సంజ్ఞతో సూచన గావింపఁబడినది. సూచనావిరహితము లయ్యు గ్రామ్యము లనేకములు గలవు. మఱియు ననేకవిధము లగుదోషము లీగ్రంథమునం దగపడుచున్నవి. వాని నీషన్మాత్రముగ నీసారిది నుదాహరింతును.

అగపడు, అగుపడు- ఆమతించు, ఆమెతించు- ఎదగు, ఎదుగు- ఎదిర్చు, ఎదిఱ్చు, ఎదిఱించు, ఎదుఱ్కొను- ఓదార్చు, ఓదర్చు- తడవు,తడువు, తవుడు- తవుడుకాడు, మొద లగురూపాంతరము లడుగడుగునఁ జూపఁబడినవి. కాని యిందలిరూపాంతరములును శకటరేఫసంయోగములును గ్రంథములం దెక్కడను గానరావు, కొన్ని వ్యవహారమందును మృగ్యములే. ఓటించు-ఓట్రించు; కతకు-కతుకు, కదకు-కదుకు, తవుడు-తవుడుకాడు, మట్టగించు, మద్దటిలు-మద్దటిలు, లోటు, లోదు అను రూపాంతరములే ప్రదేశమం దేవి వ్యవహారసిద్ధములో నాయెఱుఁగినంతవఱకుఁ దెలియరాలేదు.

అర్థనిర్ణయమునందు ననేకదోషము లున్నవి. ఆమెతించు-సత్కారపూర్వకముగాఁ బిలుచుట, విందుచేయుట యగునేమో! క్రుచ్=కాంక్షించుట.(చుట్టుకొనుట శ ర) అవు మొదలగునవి పొడుచుట క్రుమ్ము కాని కుమ్ముకాదు. దుయ్యానకు బాణము దూసిపాఱుట కాని పిడికిలినుండి జాఱుట కాదు. ఒకవేళ

పిడికిటనుండి విడుచుట యగునేమో? కతకు మొదలగు నాల్గురూపములకు
భోజనసామాన్యమే యర్థమైనను శునకాస్వాదనమే యని నియమించుట సరి
కాదు. రాపాడు దోషమారోపించి తెల్పుటంట? వంచివేయుటకు కట్టివంచు
ట ప్రసిద్ధము. ద్రవపదార్థ మొలికించుట గ్రామ్యము. ప్రకృతిప్రత్యయ నిరూ
పణమందును దోషము లగపడుచున్నవి. అడు-అటచేతితోఁ గొట్టుట యను
చు వర్తమానార్థకప్రత్యయము నని తెలుపుట తప్పుగాదా? ఔడుగఅచుతో
ఔడుగఅ ధాతువంట, చు వర్తమానార్థకప్రత్యయ మంట. ఇంతటి వైపరీత్య
మెందైనఁ గలదా?

వ్రాఁతప్రతియందు ధాతువు, సంస్కృతార్థము, ఆంధ్రార్థము, వర్తమాన
భూతభావికాలికప్రత్యయములు, విశేషములు నని యేడువిభాగములు ప్రదర్శిం
పఁబడినను, ముద్రణమున ధాతుధాత్వర్థములు మాత్రమే ప్రకటింపఁబడినవి.
అన్నిధాతువులకు వర్తమానమున చువర్ణకమును భూతమున ఇత్-ఇన్వర్ణక
ములును, భావిని ఎద్, ద్వర్ణకములును దెలుపఁబడినవి. విశేషములందు
సమానధాతువులు, శాస్త్రీయములు, అస్వతంత్రములు మొదలగువిషయము
లు పేర్కొనఁబడినవి. అన్నింటికిని జివర డుప్రత్యయముతో నర్థము నిరూ
పింపఁబడినది.

వైయంశము లన్నింటి నాలోచించినచో బరిషత్తువారు ప్రకటించినది
చిన్నయసూరికృతమేనా యనుసంశయము గలుగుట సహజము. చిన్నయ
సూరివంటి లాక్షణికశిరోమణిగ్రంథమం దిట్టిదోసఁగులు పొసంగునా యను
శంక దుర్నివారమే యైనను గొంచె మాలోచింపఁదగును. శ్రీమత్సూరిగారు
ధాతుమాల నొకదానిని రచించి రనుటలో నెట్టిసంశయమును లేదు. చెన్న
పురిప్రాచ్యలిఖితపుస్తకాగారమున నొకధాతుమాల చిన్నయసూరివిరచిత మగు
నది యుండెడిది. ఆపుస్తకము నెవ్వరో యపహరించినను దానివరుససంఖ్య
యుఁ బేరును నిప్పటికిని గలదు. పరిషత్తునకు లభించినప్రతి శ్రీసూరిగారి స్వ
హస్తలిఖితము కాదు. వారిప్రతికిఁ బుత్రికయో పౌత్రియో యింకనువ్యవహిత
సంతతియో తెలియదు. ప్రతులఁజూచి పుత్రికల వ్రాసికొన్నవారు తప్పుల
దొరలించుట వింత కాదుగదా! శ్రీసూరిగారిగ్రంథములు చాల నీనడుమఁ బరి
షత్తువారికి లభించినవి. వానినెల్లఁ జూచిన నీవిషయము సత్యమే యని తే
లును. లోకములో వ్రాఁతతప్పులు పడుట నైజమే కాని ప్రక్షిప్తము లధికము

గాఁ దూఱుట శ్రీసూరిగారి గ్రంథములకు సంభవించిన మహోపద్రవము. వారియందు గౌరవాతిశయమునఁ దమ రేమీ సాధించితి మనుతలంపున మంచిచెడ్డలారయక యడ్డమైనగడ్డి నెల్ల గ్రంథమందుఁ జొప్పించుట శ్రీసూరిగారి గ్రంథములం దధికముగా నగపడును. అట్టిచీకాకులు లేకున్న సీధాతుమాల యెంతటిగౌరవము నొందెడిదో ? ఇదియే కాక శ్రీసూరిగారి గ్రంథము లముద్రితము లేవియైనను మనకు నిర్దుష్టముగ లభించుట దుష్కరమే. ఎట్లయినను నేను బ్రారంభమునఁ జేర్కొన్నంత యుపయోగ మిప్పటియీ గ్రంథమునకు లేకున్నను దీనియవసరము గలదనియే నావిశ్వాసము. గ్రామ్యములో గ్రాంథికములో యగుధాతువుల నొక్కచోఁ జేర్చి వానియర్థము నిరూపించుట వ్యుత్పిత్సువుల కత్యంతోపకారకముగదా ? అందును గ్రామ్యరూపముల వలన భిన్నదేశవ్యవహారము సుగమ మగును. కావున సీధాతుమాలను బ్రకటించి యాంధ్రసాహిత్యపరిషత్తు మహోపకార మొనరించె ననుట కావంతయు సందేహము లేదు.

వరపన్నపెట, గంజాము.
20-1-1930

కత్తి సాంబమూర్తిశాస్త్రి.

ఉ. పాటలగంధితోఁడ హరి పానుపునందు వసించునత్తఱిం
బాటలగంధు లింపడరఁ బాడఁగఁ బాటలు నవ్వులాటలన్
మాటికిఁ గేలుదప్ప కెడమం గుడి రువ్వెడుమారునంపపూ
ఝాటపునీటు లెన్న నెకసక్కెపుమాటలు మీఱెఁ గార్శ్యమున్. ౧౪౩

— శ్రీకృష్ణునకుఁ దాంబూల మిచ్చుట —

క. ఆయెడఁ బదినూఱులబలు, చాయలుగలవేల్పుజేఁడు సన్నయొసంగం
జాయకొమరుండు దమ్ముల, మాయదుభర్తకు నొసంగునభిరతి వచ్చెన్ ..
ఉ. వేయగుపాదముల్ గలిగి విశ్రుతధీమహిమంబు గాంచఁగా
చాయపొలంతిజేఁ డతనిసంతతివై తగునీకు నెవ్వఁడుం
బాయవు మాంద్యపంగుతలు భావజతండ్రికి పీక్ష్య మిచ్చె డే
చాయ నొసంగెదంచు హలిసాత్యకిముఖ్యులు నవ్వుచుండఁగన్. ౧౪౪
గీ. మాంద్యపంగుతలన్నచో మానుఁజార్థ, సమసనంబచ్చుటనుమష్ఠిజానుమీఱు
ననుచునవ్వుచునుత్తరంబాడికొనుచు, హరికి నసితుండు వీడియంబమరనిచ్చెఁ
ఉ. తెలివి దలిర్ప నా కబలిఁదీరఁగఁ గృష్ణుఁడు దివ్యరత్నముం
దెలిబలుమ్రాను మోముకతితేటలుగల్గిన గిడ్డి నీగికి
న్వాలయఁగఁ బంచి తద్ఘ(టి)తశ్రుతసద్వయథేష్టవస్తునం
కలన సమస్తలోకముల గారవ మొప్పఁగఁ దన్పి పంపుడున్. ౧౪౬

— అప్పగింతలు —

క. అంతట నంతటిచుట్టం, బంతఃకరణం బపారగానందపయో
ధ్యంతరముననోలాడఁగ, నంతికచరుఁడౌచుఁ గూర్మిసల్లునిఁబలికెన్. ౧౪౭
ఉ. ఎల్లజగంబు లేలుపరమేశ్వర భక్తజనావనార్థమై
యిల్లలితంపుమానవసమీహితచేష్టలు గాంచుసామి నీ
వల్లుఁడవైతి గానఁ జరమాద్రికి నవ్వలఁ జిమ్మచీఁకటుల్
ద్రోల్లఁగఁ జేయునట్టిడిపటుత్వము గాంచు ప్రభల్ భరించితిన్. ౧౪౮
గీ. ఎంతకాలంబునుండియో యెడయకుండు
పటుతమోగ్రస్తత హరింపఁ బాలుపడితి
నస్తమయశూన్యమైనట్టి యభ్యుదయముఁ
జెందఁగాంచితి నయ్య ముకుంద నేను. ౧౪౯

గీ. హారణ మొసఁగుట మాకు నర్హమిచట, నఖిలకర్తకు నీఁదగునట్టి దెద్ది
యయిన సర్వస్వసందర్శనానుకూల, దక్షిణాశోకభర మిచ్చుతలఁపు నాది.

క. హరిదశ్వుఁడు హరి నీగతి, సరసచతురవచనరచన సమ్మోదితుఁగాఁ
గర మొనరింపుచు నానతి, వరమపురుషుచేతఁ గొనుచుఁ బలికెం గూఁతున్.

ఉ. ఓమదగణ్యపుణ్యవిభవోదయపూర్ణఫలస్వరూపపు
శ్రీమణి నీకతంబున గరిష్ఠగుణాంబుధి కృష్ణుఁ డల్లుఁడై
నామదిపూర్ణకామత ననంతసుఖం బగునట్లు సేసె నిం
కేమివిచార మీహిత మహీనతఁ జేకుఱె నీకు సుందరీ. ౧౫౨

గీ. భాగ్యసౌందర్యశీలాసపత్నివైన, చాన నీకు సపత్నులు చాలఁ గలరు
వారిమదిలోనవిక్రియోత్పత్తిగగన, కుసుమసాదృశ్య మొందింపఁగోరవమ్మ.

గీ. అంబుజాతాక్షి సర్వకార్యంబులందు, ననుసరింపుము హరిజాయ ననుసరించి
హరికథానుగతిస్ఫూర్తి నలరనీకుఁ, దల్లియగుచాయఁ బోలంగఁ దల్లి మేలు

గీ. వగలుగావించి మాయమ్మ వగలుసేయు, వానిబిడ్డన నడచుట వాసిగాదు
మాకు వన్నెగ నంతటమైత్రిపూని, భువనబాంధవసుత యనబుద్ధిగనుము. ౧౫౩

శా. అమ్మా మమ్మెడఁబాసితంచు మదిలో నావంత యైన న్విచా
ర మ్మానం బనిలేదు కాంతలకు నబ్రహ్మే యదెన్నంగనై
న మ్మానక్ భవదీయసన్నిధి జగన్నాథుండు నన్నుం గృపన్
సమ్మానింపుచుఁ బాయఁ డెప్పుడు నిజస్ఫారాక్షిగాఁ జూచుచున్. ౧౫౪

చ. సిరికి నివాసమైన హరిచెట్ట గ్రహించిననీకు లక్ష్యమే
హారణముగాఁగ నే నొసఁగునర్థము లైనను దండ్రిపట్టికిన్
హారణ మొసంగు టిజ్జగము లాగమముల్ దగఁ దెల్పు నింతె కా
దరయ బితృస్వకాంతు ధృఢమై మదిఁబుట్టెడు నెట్టిబోటికిన్. ౧౫౫

ఉ. కావున సర్వవస్తువులు గల్గుటకై సకలోపచారస
ద్భావముకై ద్యులోకతరుబంధురధేనుచిరత్నరత్నముల్
భావము పొంగ నిత్తుఁ గొను భాగ్యవతీతిలకంబ వాని నీ
భావములో స్మరింపఁ గనుపట్టి ఘటింపఁగ నానతిచ్చెదన్. ౧౫౬

క. అని చాయతోడఁ గూరిమి, తనయామణి గారవించి తరళేక్షణచే
వనజాప్తు డోకవిధంబున, ననుమతి గైకొనుచు నొందె నాత్మాలయమున్.

క. మహానారాజకుమారక, మహనీయగుణాభిరామ మైథిలకన్యా
పహరణపరఖరదూషణ, సహజాపైయాపృకరణ సత్యాభరణా. ౧౬౦

గద్యము.

ఇది శ్రీరామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవయజ్వ
సముజ్జ్వలత్కృపోక్షిత కటాక్షాసాదిత పాండిత్యాభరణ ప్రభంజనపం
శాబ్ధిరాకాశశాంక నిరంతరారాధితవిచక్షణశశాంక అభినవ
నన్నయభట్టారక అహోబలపత్యాహ్వాయకవిమహో
పాధ్యాయభట్టారకప్రణీతం బైనకాళిందీకన్యా
పరిణయం బనుమహాప్రబంధమునందుఁ
బంచమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# కాళిందీకన్యాపరిణయము.

## —॥ షష్ఠాశ్వాసము ॥—

క. శ్రీమత్పద్మజభవహృ, త్తామరసస్ఫారభృంగ దశముఖభంగా
శ్రీమహిత హితజనాంబుజ, ధామనిధి ప్రముదితాత్మ దశరథరామా. ౧

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము. ౨

క. చారుశ్రీజవికరమై, హీరోపలకాంతిపూరహృదయము గమనై
సారసుధానిలయంబై, పారావారంబుభాతి భాసిలు మఱియున్. ౩

క. అర్థసమృద్ధంబై శ్రీ, వర్ధనచతురాస్యహర్షవర్ధనపరమై
వర్థిల్లుగీత మన గృహ, మర్థాధిపసౌధసదృశ మగ్గేహమునన్. ౪

గీ. ప్రాప్తమండప మచ్యుతప్రాప్తిపదము, సుప్రసన్నమునం పూర్ణ సులలితమును
పీఠసాదృశ్య మలరారి వేడ్క నెఱపి, యచ్యుతంబాయుజిత్రము నలరుశయ్య.

క. చారుమహాభోగంబై, భూరిశిరోరత్నకాంతిపూరావృతమై
తోరంపు శేషశయ్యా, గేరెడుసుకుమారపుష్పకేలిశయ్యన్. ౬

క. వసియించె వాసుదేవుఁడు, ముసిముసినగుమోముఁదమ్మి మొనయప్రసాదం
బసదృశకాంతావిషయ, ప్రసక్తప్రేమానుబంధపటిమం దెలుపన్. ౭

చ. అతికఠినంబులౌ జగతి హాటకరత్నము లంగయష్టి నీ
దతిమృదు వెట్లు పొందెనఁగు నైన సమంబటులేని భూషణా
వృతి కిది వేళ యౌ నటంచు *వేగసమాసవిభూషణావళుల్
సతి ఘటియించు మంచు రవిజాత విభూషితఁ జేసి రంగనల్. ౮

శా. సారోదాత్తవిశేషచిత్రకవిభూషాకీర్తి సమ్యగ్† గుణో
దారవ్యక్తి ‡సువృత్తి దోషరహితన్ ధన్యోల్లసత్ §న్యాయకన్
నీరేజేక్షణఁ గావ్యలక్ష్మిబలె (1)మున్నిద్రాశ్రితాస్యామ్నాడై
మారుం డప్పుడు చూచి రోసి పదలేమన్నింపు శాస్త్రాస్త్రముల్. ౯

క. (స)తియంగంబులఁ బొంగడెము, నతులప్రాజ్ఞావళీసమంచిత వాచా
గతుల ద్వితీయతృతీయ, ప్రతిభటరహితప్రటలంక(ర)ణయుగ(2)మొనసెన్.

---

* వేగసమాసమభూషణా † గుణాహారా- ‡సువృత్తి- § న్యాయకిన్
(1) మున్నిద్రా-, (2) మొనసెన్.

చ. చెలులకు నతిప్రయత్నమె(గ)జిమ్మఁచుఁ గమ్మవిలింటివానిపూ
ములుకుల *క్రొ వ్వడంపుఁచు(ను) ముప్పిరిఁగొన్న నురాగగర్వమున్
నిలువ(న)దల్చుచుం జెలువ నిల్పెను నొక్కఁడుగెక్కకుండ విం
తలు భళిరా భళీర మదిఁ దార్కొను సిగ్గువటుత్వవైఖరుల్. ౧౧

సీ. మదనుఁ డను కర్ణధారుండు గదియు నేని, వెలిమయుడి యను నావ శోభిల్లు నేని
వేకరంబులనారదారబిడ్డయేని, చెలువ దాఁటంగ లేదయ్యె సిగ్గుకడలి. ౧౨

చ. వెనుకకు సిగ్గులాగఁ దమివేగము ముందఱ కిగ్గ నవ్యథం
జనుస సహింప †భామము యుసంధిలు మధ్య మభావ మైగచో
ఘనకుచ‡భారధారణము గాఁ జన దంచు వచింపవచ్చునే
ఘనపదమాశ్రయించి కలకాలము §చుండెడివాని గానమే. ౧౩

క. వెడవింటిజోదు విరివి, ల్గుమసుమడం జేయఁ జేయ గుబకుచ శొక్కా
క్కడు గాఁడకుం గడచినఁ, గడుదూరం బయ్యె లజ్జగరిమం బెంతో. ౧౪

చ. అలపలరాజు వైదలి రమాధిపు(కజ్జకు) వేగఁ (1)జేర్పఁగా
వలనొదలిర్ప నూఱటలఁ బాయుచు గుప్పెడుఁ బువ్వుబాణముల్
చలనము లేనికూర్మి నవసం బయి మించినలజ్జ జాయగాఁ
గలఁగుచు మోము వాంచెఁ గడుఁ గ్రమ్మెడుసిగ్గున సిగ్గులాఁడి (2)తాన్ ౧౫

చ. చెలి తలవాంచి తెల్పె బలుచెల్వపుఁగ్రొమ్ముడిఁ జిమ్మచీఁకటిం
గలసి మెలంగు పావటచొకాటపుఁ జెంద్రపురేఖచే మనో
మిళదనురాగవైభవము మించఁగఁజాలదు లజ్జ నెమ్మెయిం
గలుగఁగ నేర్చు సత్వరితగామిత యంఘ్రుల కెన్నఁ జోగిన్. ౧౬

వ. అప్పు డొక్కచెలికలువకంటి యక్కలికి నుద్దేశించి (యి ట్లనియె.) ౧౭

ఉ. క్రొత్తగఁ బ్రాణనాయకునిఁ గూడఁగ నేగెడు వన్నెలాఁడికిం
గ్రొత్తయె లజ్జ లోఁగొనుట కూర్మి చెలుల్ గడితేర్ప తేనికిం
జిత్తము రంజిలంగఁ దగఁ జేయుట యిట్టి విచిత్రలజ్జ మే
మెత్తఱినైన విన్నయది యే కను డక్కడి మాట యుగ్మలీ. ౧౮

వ. మఱియు నొక్కయింతి యక్కాంత కి ట్లనియె. ౧౯

క. ఇటువంటి ముద్దరాండ్రే, కటుతరకుచకుంభవజ్రకంజరసీమన్
ఘటియింతురు నిజలీలల, నిటునటుఁ జనసీక జీవితేశ్వరశుకముల్. ౨౦

(*) ద్రొవ్వ- † భావము- ‡ భావధారణ- § నందెడి. (1) చెప్పగా- (2) తోఁక

వ. వెండియు నొక్కతె టచక్కులాఁడి యచ్చక్కనికొమ్మ కిట్లనియె ౨౧

క. నను వైనపూలపాన్పున, మనసూరుచు నున్నవాఁడు మాధవుఁ డయ్యో
తనువునఁ గల్గుమృదుత్వము, మనమున నీ కెల్లలేదు మంజులవాణీ. ౨౨

వ. పిదప నొక్కబింబాధర యయ్యిందుబింబాస్య కిట్లనియె. ౨౩

క. హరిఁ గూడక తుణ మైనం, భరియింపఁగరాదు మేనఁ బ్రాణము లనుచున్
విరిసెజ్జఁ బొరలు నక్కాంత, దరియ(నక) యిట్టిలజ్జ దానిఁ సెటు ననునో. ౨౪

వ. మఱియు నొక్కప్రౌఢ యచ్చేడియకంటి కిట్లనియె ౨౫

ఉ. అప్పరో నీవు నీమగని(యందపు)నొమ్మున లచ్చిరీతి నీ
వొప్పులఁ గుప్పుచుం దదధరోష్ఠసుధారస మానుచున్నఁ గం
పొప్పు డు నీకు మోవి దశనోదితరాగ మతండు సేయఁగాఁ
దప్పితి వంచు మాటికి నదల్పఁగ సిగ్గది యెంతఁ బోవునో. ౨౬

వ. అంత నొక్కనిక్కులాఁడి యచ్చక్కఁదనాలకుప్ప కిట్లనియె. ౨౭

మ. ఈరులజ్జాభర*గవ్హారంబునను రాగోద్వృత్తి కీవేల దా
పరముం జేసెదు మర్మముం దెలియు మాపజ్జ వృథా గాదె యె
వ్వరికైనం గనఁ జేటఁ జెందు మదిలోఁ బాటిల్లురాగంబు శ్రీ
కరవక్త్రాంబుజరాగనామకమహాకర్ణేజపం బంచుటల్. ౨౮

వ. అనంతరంబ యొక్కపృథునితంబ యాకాదంబగమన కిట్లనియె. ౨౯

ఉ. ఇంతచలంబు సేయ ఫల మేమని చెప్పినఁ గాక సేసి దో
కాంతరొ గట్టివాయి యని కాంతుని నెమ్మదిఁ దోఁచునమ్మ శ్రీ
కాంతుని కెందఱో కలరు కాంతలు వారలకెల్ల మిన్నవై
కాంతమనోనురంజనముగా సుగుణంబుల వన్నెకెక్కవే. ౩౦

వ. తరువాత నొక్కయుగ్మలి యక్కోమలి కిట్లనియె. ౩౧

క. అతినిబిడలజ్జ గాదిది, పతికి న్మదిలోన నువిద సంగమవేళం
గృతములకుఁ బ్రతికృతంబుల, నితరవ్యాపార మెడసి యెన్నఁగఁ జొచ్చెన్.

ఉ. అత్తఱి నీలవేణి నగ †వాఁగుచు నెచ్చెలులట్ల నడించి యో
చిత్తజుఁ కుల్కి కల్కి వికచిత్తము నిల్పుచు నాదువిన్నవం
బిత్తఱి నాలసింపవల దెంతయుఁ బ్రొద్దు సనంగఁ జొచ్చె న
య్యుత్తమనాయకుం గదియ నొప్పుగఁ నెంతయు నంచుఁ బల్కఁగన్.

---

* గహ్వరము=నెపము. †వాసుచు.

మ. లలనామన్మథ*మూత్నదృష్టి విలసద్రాగావగావేగసం
†కలనాదీవ్యదపత్రపాధుని నెదుర్గా ‡సీఁ దితభ్రాంతిచేఁ
బలెఁ గ్రొంజెమ్మట గ్రమ్మ మెల్లన రమాప్రాణేశశయ్యాంతిక
స్థలజాగ్రద్ద్విజాధినాయకమణిస్తంభంబు నండం గొనున్. ౩౪

క. కేళీవేళల శ్రీహరి, నీలాగునఁ గౌఁగిలింతు నే ననుక్రియ న
బ్బాలిక కౌఁగిటఁ జేర్చెను, నీలస్తంభంబు సిగ్గు నెరయఁ గ్రమ్మఁగ. ౩౫

వ. అంత నక్కాంతం గడచి సఖీజనంబు సవినయభక్తిపూర్వకంబుగా మ్రొక్కి ముందఱ నిలిచిన నీలవేణీనీలవేణి నీక్షించి జలజాక్షుండు నికటస్థలవిలసదుగ్రకరనందనాసుందరేందురేఖావిలాసన ముల్లాసబలప్రబ(ల)విభవదంతరామోదజలధిఫేనాయమానం బగుమందస్మితంబు ముఖాంబుజంబు నలంకరింప నిట్లనియె. ౩౬

క. చెలి వార్తలేమి? దేవర, గలిగినభాగ్యమున మనసు కడురంజిల్లన్
జలజాతనయన మిముఁ గన, వలయుచు వచ్చుటయకాని వార్తలు గలవే.

క. అలికుంతల క్షణదాముఖ, మలులితతిమిరంబు గ్రమ్మె నదియేమి? హరీ
తెలివిఁ గొను కృష్ణపక్షము, వలగొను నీక్షణదముఖము వదలు నెలమమున్.

వ. ఇట్లు సాభిప్రాయంబుగాఁ దనచతురోక్తికిం దగినయుత్తరం బొసంగు నాతిరంగనయనప్రౌఢిమకు ముదంబుఁ జెంది నందకపాణి పాణివలయాదిభూషణపూర్వకంబుగా నభినవాంబరతాంబూలంబు లందఱకు నిడి వెడలి చను సంజ్ఞ నవతరింపం జేయఁ జాయకట్టికి నీచెట్టఁ బట్టినదారి వంపు వెట్టినవనులకుం జని మొదమ్మురో తిరిగి వచ్చెద మిచ్చట నుండుమని మురుంగుగాఁ బల్కి యచ్చిలుకలకొలుకు లొక్కింత వెడల ననంతరంబ— ౩౯

మ. చతురోక్తిప్రవిలాసవైఖరుల నంచద్భ్రూభలు నర్తిల్ల ల
జ్జితసంవిస్మితకాంతమఃఖ్యలలితశ్రీవీక్షణాళీసితా
సితపంకేరుహమాలికన్ మదనకాంక్షేయప్రభాపాళికన్
సితనీరేజదళాక్షి తేని కొనఁగెన్ సేవార్హమా కానుకన్. ౪౦

ఉ. కామిత మేమియు న్మనసు గాంచనియట్టియవాప్తకాముఁ డ
క్కామునితండ్రిఁ గామునిచోకాటపుబాణము భామ చూచు చుం

---

* యత్న † కలనందిర్వ్యపదత్రపా ‡ నిందితభ్రాంతి.

తే మదిఁబుట్టువీరునియు దీర్ఘపరాక్రమ మెచ్చ నిచ్చెఁ బో
రామికి సూనుచెంగటఁ బరాజయ మొందుట నీతియే కదా. ౮౧

క. హృదయగ్రంథి(వి)భేదము, మొదలంటఁగఁ జేయుబోధమూర్తికి నపుడా
మదవతిహస్తగ్రంథిన్, వదలించు టతిప్రయాస వాసిత మయ్యెన్. ౮౨

చ. కరమణికంకణధ్వనులు కామధనుర్గుణనిక్వణంబుతోఁ
గరము ఘటిల్లఁ గెల్చుడి నొకానొకయత్నమున న్వదల్చి శ్రీ
హరి హరిమధ్య నంకతల మందు నొనర్పఁగఁ గాంత రాజిలెన్
హరిమణినీలవేదిఁ దొలఁకారెడు పుత్తడిబొమ్మయో యనన్. ౮౩

క. చెలికీలుగంట మెలగెడు, నలినాక్షునిమృదులపాణినఖరుచిరాజుల్
కిలకిలనవ్వఁ దొడంగెం, బొలుపూరెడు మేల్మిపయిఁడిపువ్వులసరులన్. ౮౪

వ. అప్పు డప్పురుషోత్తముండు మదనలీలారహస్యప్రతిపాదకకృతు లగుకృతుల
నిరర్థకతాదోషంబు నిజానుష్ఠానమహిమంబున నపనయింప నవధరించి
యమ్మించుఁబోఁడి కిట్లనియె. ౮౫

ఉ. కన్నది కన్నొకండు మఱి కన్నొకఁ డందపునీదుమోముచె
న్నెన్నఁగఁ గొన్న దీదృశదృగీహితవై యలరారు టబ్రమే
సన్నుతగాత్రి నిన్న ఖిలసద్గుణసంపద ముజ్జగంబులో
నన్నులమిన్న యంచు విబుధాళి ముదంబున నోలలాడఁగన్. ౮౬

గీ. మానవతి నీవు శృంగారమయత రసిక, చిత్తమెంతయు నలరఁజేసెదవు గాన
నీకలంకార్యత ఘటింప నేర దెట్లు, భాసురైకావళీముఖాభరణగణము.

గీ. భూషణంబంగితభరించెభూష్యమగుట, భూషణతఁగాంచియంగతభూషనగునె
అర్థములు భావశబలతాద్యములు వాని, కాంతరచియింప వేయలంకారములుగ.

ఉ. నేరుపు మీఱఁ గన్నఁగవ నీటగు కొప్పునఁ గప్పు పూని శృం
గారము నీదురూపుగొని గారవ మొప్పఁగ న న్భజింపఁగాఁ
జేరఁగవచ్చెనో తనదుసేవకభావము నాదుసేవ్యతన్
ధారుణి సుప్రసిద్ధముగఁ దా నొనరింపఁదలంచి నెచ్చెలీ. ౮౭

గీ. ఉవిద తావకసుగుణాదియోగమహిమ, వాసనాత్మక మగురతిభావమిపుడు
రసతఁ గైకొనె నీకు నీక్రమము కాన, వ్యక్తికత్వంబ మనకు సిద్ధాంత మరయ.

ఉ. నేత్రము పర్వసంతతన నిమ్మి యొసంగెడు సౌష్ఠవంబుగా
సూత్రితరీతి నంగములు చొప్పడు పాత్రత నీకుఁ గల్గదే

పాత్రత నీకుఁ గల్గినను భామిని నిశ్చలవృత్తి నుండఁగాఁ
జిత్రము మాకుఁ దోఁచె నః చెల్వఁ దొనర్చెను మందహాసముల్. ౫౧

మ. రసకృత్సద్గుణ మై యలంకృతిభరప్రస్ఫూర్జితవ్యక్తి నొ
పసియించుల్ సుకవిప్రబంధములఁ ద్వదీయం బైన బల్కొప్పు దా
వెసఁ దూలించును గర్భకంబునకుఁ(?) దెల్విం గైకొను న్వాంతగా
రసవిస్ఫూర్తి నొనర్చు గర్భకము సంగ్రాహ్యంబుగాఁ జిత్రమే. ౫౨

చ. చెలి తలవాంచి చూపెద(వొ) చెల్వపుఁగొప్పిది సాటి దీనికిం
గలుగునొ కల్గదో యనుచుఁ గల్గమి సిద్ధ *మనర్ఘగత్న సం
కలితపుఁగుప్పె చామరముగాఁ జటయే గణింపఁడే యించు న
బ్బలువగలాఁడు దా †నిమిరెఁ బంకజలోచన కేశపాశముల్. ౫౩

ఉ. కన్నులఁ ‡గప్పకొఁ దమముఁ గాదనఁ దేనియతీపిచూపఁగా
నెన్నదు కల్వఁ బల్కు లొకయింపునఁ బల్కిన బర్హిబర్హముం
§బెన్నరితేటలం గొనదు వింతలుగా మెఱుపుల్ ఘటించు న
బ్బన్నను రోయు నీకబరి యబ్బునె యాకుటిలాత్మ(1)సఖ్యముల్. ౫౪

చ. కువలయజేత నీవలుఁదక్రొమ్ముడి నెయ్యపుఁగొమ్మ (2)యిచ్చటన్
సవిధములై ప్రమాణములు సంగతమయ్యెను జూచి తెల్పఁగన్
నవరనిపాతటం గలుగు చక్కసికుంకుమపేటివిక్రమం
బవుల ఘటిల్లుమౌక్తికసరాకృతి గాంచినశుద్ధకీర్తియున్. ౫౫

చ. స్ఫురితగుణానుగాత్మరసముజ్జ్వలమౌక్తికరాజి సద్రసా
కర మతిచిత్రబంధ మధికస్ఫుటచారువిభూషణంబు నై
వరఁగెడుఁ గ్రొమ్ము డుత్తమనిబంధనరీతి విచిత్ర మొక్కచే
తరళమృగాక్షి కేవలము దాఁ గుటిలత్వము మానదయ్యెడున్. ౫౬

క. బిత్తరి మధురగుణంబున, నుత్తమకావ్యంబుఁ బోలు నురుభూషణ మై
హత్తున్ ధృతి యక్కావ్యము, నొత్తు స్ఫుటవ్యక్తికిఁ బరి యొగిమధ్యమమున్.

గీ. మగువ ముక్తాళి యిది శిరోమార్గతమము,(?)పరివ్యాప్తా...షంబు నిరతశుద్ధ
మౌక్తసద్గుణ మమలవంశాభిజాత, మెట్టు లస్మన్మహానంద మొనయదిచట.

సీ. నెలఁత నీవేనలి నీరదపాళిగాఁ గనుము విద్యుల్లతాఘటనఁ జెందెఁ
గలికి నీతురుము చొక్కపుఁగల్వకంపు . . జాఁకించు పువహించెఁ జంద్రరుచుల

---

* మనర్ఘ్యశ్రీ † నెమరి ‡ గొప్పకొంద § వెన్నెలతేట (1) సౌఖ్యము. (2) యిచ్చలన్

మగువ నీకబరి మన్మథు రాయుధముగా జాళువాజలపోఁతజాను గాంచె
భామ నీక్రొమ్ముడి బర్హిబర్హంబుగాఁ జంద్రు సంబంధచారు పర్యోఁ
జెలువ చిత్రాళిపాళిగాఁ జికురభరము, సరసతభరించెఁ జంపకచ్ఛాయఁడాయ
ననుచునఖరోచులంటటనలరుచుండ, గొప్పనుప్పెన గోవిందుఁ డొప్పనీఁటి

చ. కలికిరో మోము వాంఛుటకుఁ గారణ మేమి కలంకిచంద్రుబిం
దులఘుటియింపఁగాఁ గలుగు దుష్టుల పల్కుల సైఁపలేకనో
తెలివి(ని)దప్పి పామరు లతిత్వర సామ్యము పల్కినంతనే
కలుఁగునె సాటి లాఘవము గాఁ బనియేమి మృగీవిలోచనా. ౬౦

ఉ. ఎక్కడివింత మాచలి ............ తోఁకట సాటి ప్రొద్దు రా
మిక్కిలి మారుపంకజము మిన్నక పండితమాన్యులీమృషా
వాక్కుల కేల జిహ్వ యులపర్చిరి పంకజవైరి చంద్రునే
నక్కడఁగించుమోమో ............ యసందగునే పయోజముల్. ౬౧

ఉ. పంకజనీలపంకరుహభావము దాలుచు కన్నుదోయి మే
ల్పొంకము సైఁచునీ ముఖపూర్ణనిశాకరుఁ జూచి చూచి యీ
పంక(జబృంద మెల్లఁ దల) వంపులకుం దగుఁగాక యుష్మమే
పంకజ*నేత్ర నీకుఁ దలవంపు లహేతుకలజ్జ మెత్తురే. ౬౨

గీ. వనితరో మోముచందురు వాంఛెదేల, కుటిలకుంతలతిమిరంబుకొర...
...నో యనుశంకనో వచ్చునెట్లు, సటలపాదేందు సేమించ నేరదెద్ది. ౬౩

సీ. చెలువ ( జ్జను మోము వాంచితి వటన్న
నవధరించితో నీవు ముఖార్ధహాతిగ
వినుము ............ హాతి దాన నెనయు నెట్టు
లడియు నొకచోట దోషత నంద దరయు. ౬౪

చ. మృగమదచిత్రకాకృతిని మీఱుకలంకము దానిఁజేసి యీ
మృగ†ధరుఁ డేతదా(కృతివహిం)చు నటంచును మోము వాంఛుటో
మృగ మసుగంధ మప్రియము సమృష్ట మశృంగము దాఁ గలంకమే
మృగమదచిత్రకం బది సమృద్ధగుణాన్వితమా కలంకమే. ౬౫

చ. మృగమదచిత్రకానుగతి మే లగుఫాలము పిల్లతేఁటికిం
దగు-లగు కేతకీదళము దా నగునం చొగి నెంచి కొప్పపే

* నేత్రి † మదు డేత దా

రగవడు తేఁటిగుం పెడసి యాడెడునందపుఁదేఁటిపిల్లల
న్నగు నగుగాదు ముంగురులు నవ్యవమోరుహాపత్రలోచనా. ౬౬

గీ. ద్విత్వరహితంపుటాకృతిఁ దేజరిల్లి, ప్రాకృతాఖ్యాకభాషనా భావితద్వి
రేఫవైఖరి గలిగి త్రిలింగదేశ, సూక్తియన నొప్పుఁ గస్తూరిచుక్కబొట్టు.

ఉ. పిన్నఁదనంబు వక్రతకె పేరువడం దగెఁ గాని లక్షణం
బన్న నెఱుంగనవ్వె నని యయ్యరచందురమోము సోగనీ
నెన్నుదు రైరజనించి కడునేర్పునఁ గైకొనిమెన్ వ్యృగీమదా
ఖిన్నతమాలపత్రరుచిఁ గీల్కొనుఁ జక్షుణ మోమ్మృగేక్షణా. ౬౭

చ. లలితపుబొట్టు ఫాలముఁ గలంకి నొనర్పఁగ నర్ధచంద్రుతోఁ
దులఁ గన దన్నమాట మదిఁ దోఁచిన వాంచితె మోముఁదమ్మి యా
యలికమునందు నందమగు *నట్టిది బొట్టిది దోషకారియే
యిల వ్యతిరేకభూష వచియింపఁగ హేతువుగాక కోమలీ ౬౮

గీ. చవుతి చందురుఁడలికంబుచక్కఁజూడ, మోము పాలంభమగుననిమాటుకొని తె
యది యుపాలంభవిషయతనందకున్న, నదిఘటిల్లుటవ్యతిరేకమగునుభూష.

చ. రసవదమై మృ(దు)త్వమున రాజిలి లక్షణలక్షితంబు నై
హాసన మొనర్చు సాధుకృతి నందపునీనిటలంబు దుష్కృతిం
గనరఁగఁజూచు సామియయిగాంచిన చందురమోమ నిక్కమీ
యసదృశగాత్రి లక్షణము నందినయందముఁ బొంకుఁ జెందమిన్. ౭౧

చ. మొయి లెడఁబాయుపూర్ణశశిముద్దులునించు(చు) రాణించునో
పయిపయిఁ గ్రమ్ముమం చెడయుపద్మము రీతి మెలంగ నేర్చునో
దయిత యపత్రపాభరము తారఁగ నీమువనోజ్జ్వలశ్రీ మే
మొయివిలసిల్లు సంశయము మేకొను నిచ్చుట దానిఁ దీర్పవే. ౭౨

చ. వదన మపత్రపాతిమిరబంధతఁ గాంచినఁ జిమ్మచీఁకటిం
జిదిమెడుచందమామ నగుసేయక యుండునె తప్పఁబల్కితిన్
వదనము సిగ్గుటిర్లు పయిప్రాలఁగ నేనియు నెప్పుడున్ బలెం
బొదలఁగ నిర్లవేళ రుచిపూననిరిక్కలఱేఁడు నవ్వనే. ౭౩

గీ. కాంతిసం(ప)న్నవస్తువుల్ గణనసేయు, వేళనీమోముతరువాత వెలయుఁజంద్రుఁ
డట్టిచోట వికల్పంబు పెట్టరాక, నగసు లనుకల్ప మది యని చనువరాదు.

---

* నట్టిడి-

చ. నెల యిది హైన మన్నయనసీరజముల్ వికసిల్లునెట్లు దా
నెలయు రసా(ంబు)రాశి వడి నిక్కఁగఁ బంకరుహంబు గాని-చోఁ
గలిగదు నేగతిన్ భ్రమరకంబులసంగతి దమ్మిహైనచో
విలసన మెట్లు రేయి యిది వింతగు సంశయ మింతి తీర్పవే. ౭౫

ఉ. పీనులయం దం(లం)కృతిగఁ బెట్టినసీలపయోజపత్రముల్
భానుతనూజ నీయసితభవ్యకటాక్షవిలాసభూషణం
బూని వెలుంగ నీక్షణము లుత్పలకాంతి భరించు నన్నమా
టానఁగరా దొకించుకయు నానఁగవచ్చు విరుద్ధలక్షణన్. ౭౬

ఉ. తోయజవైరి హై మొగము దోఁచినవేళలఁ గన్ను లుత్పల
శ్రీయుతిఁ గాంచు వెన్నెలఁ బ్రసిద్ధిగఁ గ్రోలుచునుండు పుల్గులై
పాయకవిల్చు మోము నవపద్మముగాఁగ న దెట్టులౌచు నీ
యాయతనేత్రముల్ మెలఁగు నార ముఖాక్షివిచిత్రవైఖరుల్. ౭౭

క. వరవర్ణిని నీనయనము, లరమోడ్పన మోముఁజంద్రునందు మెలఁగుచున్
సురుచిరనీలపయోరుహ, సరసిరుహైకత్వజన్మసంగతిఁ దెలుపున్. ౭౮

సీ. శారదపూర్ణిమాచంద్రమోబింబంబు గర్వసర్వస్వంబు గాసిఁజెందఁ
దరుణార్కకిరణసంధానజాగ్రన్నవ్యపద్మలాలిత్యంబు పటిమదక్కఁ
జంద్రాతపాస్వాదసమ్మోదమాద్యచ్చకోరవిలాసంబు కొదవగాంచ
మకరందరసపానమత్తమధుప్రతపోతలావణ్యంబు పాలుపుఁదొలఁగ
నెరి మొగంబెత్తి చూడవే నీటులాఁడి, వెడఁదకన్నులు విప్పవే బెడఁగులాఁడి
సిగ్గుపడువేళ దప్పనే సిగ్గులాడి, యన్న మన్నింపుఁదలఁపవే వన్నెలాఁడి ౭౯

ఉ. ఓపరిపూర్ణచంద్రవిజయోజ్జ్వలవక్త్ర శశాంకబింబ నా
చూపులపేరుగొన్న పరిశుద్ధచకోరములానఁ గాంతి దా
లోపము గాంచునంచు నవలోచన వాంచెదె మోము నర్థిసం
తాపము వాప సంపదకుఁ దక్కువె చంద్రుఁడు కీర్తికెక్కఁడే. ౮౦

గీ. విమలముఖచంద్రుసన్నిధి*వేగుగాంచు,కన్నులకునిప్పుడుం డెడుకమలములకు
సాటిఁజెప్పంగనమరునేసాటియగును,నెలకునలరెడుజలజంబుగలిగెనేని. ౮౧

మ. అరమోడ్పనముఁ దొలఁకికన్న †నెఱియా నందంబు గైకొన్న నీ
వరనేత్రంబుల కెల్లపాటి యనఁగావచ్చున్ (న)సంకోచతన్

---

* వేను † నెరియానందంబు.

సరసత్వంబుఁ దొరంగి చూడ వెగటై సత్త్వాతికిన్ దూరమై
ధరలో నుండెడు వారిజోత్పలములం దన్వీ జగన్మోహినీ. ౧౨

క. విలసనమహిమం బెంతే, కలిగియుఁ దలచుట్టుఁదిరిగి కలయఁ జతురిమం
బలవడమి దూర్యశముక, జ్జలమై వైవాడు నీదుచక్షుర్యుగమున్. ౧౩

గీ. మగువ నీవు దృగుత్పలమాలయందు
మిాలనాలంకృ(తి)యొనర్ప మెఱుఁగు గాదు
రూపఫలహేతువులఁ జాల రుచికరంబు
మిగుల నుత్ప్రేక్షఁ-గావింపు సొగసులాఁడి. ౧౪

ఉ. అద్భుతరంగల *స్నిగుల నప్పుడుఁ దప్పదు కోవ మించు నీ
విప్పుడు చూపు చాలుకొనసీక పెనంగెడొ యట్టులైన నో
రొప్పులకుప్ప కొప్పుజిగియొప్పఁదనంబునఁ జాయ మాయఁగాఁ
దప్పక సేయు నప్పుడదిఁ దప్పనితోఁచు బెడంగవైతివే. ౧౫

చ. చెలువరొ సర్వలోకముల చేతుల మోద్పులు గంటిఁగాని నేఁ
గలనయినం గరాబ్జములు గట్టిగ మోద్పుబెడంగ నేరికిం
బలపలగ్నుఁ వేడలి(యఁ)బాయుము +నన్నుఁ గృతార్థుఁజేయు మం
చలికులవేణి సిగ్గువడు నంజలి సేసెనఁ జక్కఁజూడవే. ౧౬

ఉ. ఎట్టివిశిష్టదేశమున నీసుక యెంతటికాల మెట్టినో
మట్టిటుఁగా కొనర్చుచుఁ గృతార్థతఁ జెందెనొ నీదు మోవితోఁ
జుట్టఱికంబు సేయునతిసుందరపంజరశద్మరాగముం
గట్టిగ దొండపండచుచుఁ గ్రక్కున ముక్కున‡కొక్కుఁ జూచితే. ౧౭

ఉ. వీనులభూషణం బగునవీనమృదూత్పలముల్ కటాక్షదృ
గ్లీనము లయ్యె వాని కవిగీతము శ్రుత్యవతంసభావముల్
గానఁ దదంతరాయఘటకత్వ§మయుక్తము కన్నుదోయికిం
బూనిక తెప్పలెత్తి ననుఁ బొందుగఁ జూడుము సుందరీమణీ. ౧౮

ఉ. కన్నుల క్రేవఁ గన్గొనఁగఁ గారణ మేమి కటాక్షవీక్షణా
ఛన్నమహేంద్రనీలమణికీలితమాలికలన్ శ్రవఃపుటా
సన్నగభీరకూపములఁ జాలఁగ నించుచు వానిమీఁదుగాఁ
జెన్నుగ నేగి ముచ్చిలికిఁ జేరుటకై జతనంబు పూనెనో. ౧౯

---

* స్నిగులు † మన్ము ‡ నొక్కు § మయుక్తమ

గీ. వనితయరగన్నుఁ గైకొనిమ(వ)సుదెలియ, నాత్మ భావించెదో యట్టియాత్మ నీదు
తపము బల్మిని సాకారతను భరించి, చాతుమంబో కుచుండె నుఁజక్కఁగాఁగె ౯౦

గీ. నాతి ప్రకృతాత్తప్రధానత్వమునయ, నత్షివద్ధంబునకు వీక్షణాన్వయిత్వ
మేలదయసేయఁదలఁపవు హేతువేమి, గర్భసాదృశ్యమబ్బినకతననిటులొ. ౯౧

ఉ. చక్కెరకెమ్మువిల్లు లివి చక్కెర యోపినయంత మెక్కి యీ
చక్కి మఱొక్కమాట వినసంగతిగాని తెలుంగుగా రొదల్
మిక్కిలిఁ జేయుచున్నయవి మిన్నక యుండెడునట్లుగాఁగ నో
చక్కెరబొమ్మ చక్కెరకుఁ జక్కెరయామృదులోక్తిఁ బల్కవే. ౯౨

క. నెలయందురు తామరయని, పలుకుదు రీమోము బుధులు భవ్యామృతముం
చిలుకఁగరాదె మరందము, గులుకఁగవలదే బుధోక్తిఁ గుఱుచపఱచెదే ౯౩

క. చిక్కను నాదగుభావము, నిక్కముగా నరచితంపు నెఱివల్కులకుం
జక్కని చెలిరో యిప్పుడు, చిక్కెడునీమధురవచనశృంగారములన్. ౯౪

క. రాలుగరఁగించునేరుపు, చాలఁగ నాకబ్బునెడు చందురుగర్వం
*బేలాచెల్లింపఁదలఁతు, రాలెల్లం గరఁగఁ బాట రహింపఁగదే. ౯౫

క. రూపవతి మామకశ్రుతి, కూపంబుల నమృతవృష్టిఁ గురియఁగరాదే
రూపింప నీమువదనం, బేపారెడుపూర్ణచంద్రుఁడే నిజమయినన్. ౯౬

చ. పరుషము లౌచు నీరసతఁబట్టయి †చెక్కులఁ డంకరించి ని
ర్భరవహనక్లమాన్వితఁ బాటిలురత్నమయోరుకుండలా
భరణములేల వీనులకుఁ బంకజబంధునికూర్మిపట్టి నీ
సరసమృదూక్తిభూషణము చాలు నలంకృతిగాఁగ వీనులన్. ౯౭

క. శృంగారవతి కుచద్వయి, సంగతమగురీతిఁ బల్కు సంగతము దగున్
భృంగాలక నిలువెల్లను, బంగారం బైన మాట బంగారమఁటే ౯౮

గీ. అరిది మాధుర్యము త్తరోత్తరముగాఁగ, వస్తువులనెన్నఁ బంచమి ప్రథమలమరు
సార‡భూమకుఁదవ్వి మెచ్చుటను నీమ, మధురసూక్తికిఁ బయి నెన్నఁ బ్రథమసున్న.

క. ప్రకృతిన్వికృతిన్స్వాల, ప్రకృతి న్నీకవిత చిత్రపద మగు ననుచుం
బ్రకృతి న్వికృతి న్స్వాల, ప్రకృతి న్నిరసించువారు పలుకుదు రింతీ. ౧౦౦

గీ. వనజలోచన నామగాయనత కొప్పి, యమళవై పాటపాడెనో యబ్రమోదవఁ
దరుణి నాగాయనతసమ్మతంబుగాక, కొదవెఱుఁగ కయోగ వయ్యెదవా చెపుమ.

---

* బేలచలింపందలచెదు † చెక్కులలంకరించి ‡ భూమస్థ

క. చంచలనయనా చంచల, చంచల*వీణాధరించి చతురతచే వా
యించెదవో ధ్రువవీణ భ, రించెదవో తెలుపు మాదరించి కృశాంగీ. ౧౦౨

గీ. శ్రుతిపుటంబుల కమృతంపుసోన లానఁగ, మానసాంభోజ మభినవమాకరంద
మాధురులఁ దేల నీవేళ సాధురీతిఁ, దేటగీతి వచింపవే తేఁటికంటి. ౧౦౩

క. నాలుగువిధముల నభినయ, లీలలు నీకంటెఁ దెలిసి లే దన వశమా
యాలోలనయన యిప్పుడు, పోలినయభినయము దెలుపు†ప్రొద్దుచనుటకున్

గీ. కలువకంటుల‡కిన్నరకంఠిపదము, యోగరూఢత నీయందు నొనరఁబూను
ననుచు జనులాడుకొనవిందు నదిని జంబొ, కాదొ తెలియఁగనగుఁ బాటకతనమాకు.

మ. అతిరక్తాధరసన్నిధానమున నాసారూఢముక్తాఫలం
బతిశుద్ధం బతిరక్తమయ్యె నిది యన్యాయం బుపేక్షింప నీ
వతులజ్ఞాననిధానమూర్తివిగదా యబ్జాక్షి మందస్మిత
ద్యుతిమాత్రంబున దానిదోష మెడయం దోలం గటాక్షింపవే. ౧౦౬

గీ. ముదిత నీముక్కుముక్తాముత్యమునకు, నాత్మశుద్ధగుణప్రాప్తి నగునతద్గు
ణంబు రూపింప నన్యగుణంబుఁ గొనఁగఁ, దద్గుణంబు ఘటిల్లెఁ జిత్రంబు కంటె.

గీ. జ్ఞానదీపంబున నవిద్య సనఁగ శుద్ధ, మాత్మరూపంబు దీపించు ననువుదోఁప
వెలఁది నీనవ్వు ననఁ గెంపు విచ్చిపోవ, గానవగు ముత్తియము శుద్ధభానమగుచు.

గీ. వికసదంభోజపూర్ణేందువిధముఁ దెలుపు, ముద్దునిద్దంపునీనెఱిమోమునందుఁ
జిఱుతనవ్వైన నిఁక నేమిచెప్పవచ్చు, మధురసామృతవిభ్రాంతి మానదింతి.

మ. తెలియక మోము వాంఛకొని తేటలనవ్వులు దేరనీక యీ
వలనున నున్నఁ జంద్రముఁడు వారిజతుల్యముగాన మోము నే
వెలముగ వాంఛియుండెఁ దనవాసియ గల్గు మొగంబు వెన్నెలల్
‡సిలుకకయుండునే యని హసింతుఁ దలంపులు నిండఁగా చెలీ. ౧౧౦

క. ఈమూర్తిఁ బలికి యాదవ, సోముఁడు లేనవ్వు పూర్ణసోముని నవ్వన్
భామామణి నెఱిసొగసుల, మోమునఁ జెలువారఁ దనదుమోము ఘటించెన్.

క. నెల నెలయు(ను) వెన్నెల వెన్నెలయును నెత్తమ్మి తమ్మినీటునఁ గదియం
గలసొగసుఁ జూడఁ గలువల, ములుకులవిలుకానికపుడు ముచ్చట యయ్యెన్.

గీ. అజ్జగద్గురునుపదేశయత్నమహిమ, భావమున నించు ప్రేమానుబంధపటిమ
హరిణలోచన తాదృశాత్యంతలజ్జ, విప్పుచూపఁగ సాగె నవిద్య పోల్కి. ౧౧౩

---

* వీణెకా- † ప్రొద్దుచ్చుటకున్ ‡ కిన్నెరకంటి ‡ సిలుగక-

క. ఆపడఁతి కొంతలజ్జకు, గోరం బెనయుంగఁ బ్రేమలుప్పతిరసమై
దీపించ బడు లావణ్యంగ, న్యాపారము దక్కి కృతము వామోదించున్ ౧౧౪

సీ. సుకుమారవర్ణ సంఘటితస్వభావం బు లలిత ప్రసాదన లక్షితంబు
ద్రుతికరమాధుర్యధుర్యస్వభావంబు సవిశేషపరివృత్తితాంచితంబు
నతితిరస్కృతవాచ్యమవిహీనదోషసర్వస్వంబు రసికానురంజనంబు
నగుచు సత్కావ్యంబు నందంబు గొనియేరి నవిమ్మృష్టసద్విధేయాంశమగుచు
ప్రీకపదమై పునర్దీప్తి విస్తరిల్లి, భూషణస్ఫూర్తుల కనంగపోషణముల
కాటపట్టయియొకవింత తేటఁగొనియె, మోముసీదని వెన్నుండుమూరుకొనియె.

గీ. సాత్త్వికస్వేదజలసుధాశ్రయుతఁగాంచు, నలికచంద్రుఁడు విశదముక్తాళిపేరు
గన్నయాత్మీయపేశలకాంతిధార, ఘనపదంబునఁబర్వించెఁ గలికికంటె ౧౧౫

మ. *ఉపమానాన్వయరూపకస్ఫురితమై యొప్పారుచుం జిత్రకం
బవరక్లిష్టతఁ జెందెనేనియును †వక్రాభిజ్ఞమా భాగ్యవ
ర్ణపదత్వన్నిటలస్ఫురత్తనకపత్రంబంచుఁ బద్మేక్షణుం
డపరిచ్ఛిన్నరసాదృతాశయత ముద్దాడె న్నిటాలస్థలిన్. ౧౧౬

గీ. చాన మోము విశేషోక్తిఁబూనదిపుడు, సామ్యమందమిగుణహానిజాడఁజూరమి
నునయనాంజనకపులకుఁ జూడనమరు, భావరసదృష్టు లందుటఁ బద్మనయన.

చ. భ్రమరవిలాసముల్ సభరభవ్యతరోత్పలమాలికల్ కటా
క్షములనచేసి మాలఁ ‡వికస్వరతల్లలితంబుగాంచె నే
త్రములు భళీర వైదుషి యుదారతయుం చొగి నెన్నుచున్ రమా
రమణుఁడు చేసెఁ దన్నయనలక్ష్మికిఁ జుంబనలక్ష్మిఁ దోడుగన్. ౧౧౮

క. కంబుధరాధరసంగత, తాంబూలరసంబుసోఁకి తరుణోంబువిభా
చుంబితనీలాంబుజములు, చుంబించెను సూర్యజాతచొక్కపుఁగన్నుల్.

క. హరికృతచుంబితపరిచిత, సురుచిరతాంబూలరాగశోభితదతుల్
తరుణ(శశి)కిరణచర్వణ, నిరతచకోరములనీటు నెఱపఁ(గ)సాగెన్. ౧౨౧

గీ. మురవిభంజనుఁ డవ్వేళ ముద్దుగొనఁగ, రమ్యతదధరపీటికారసము నయన
పద్మములనత్త నుద్వేలబహుళరాగ, రసము వెలికుబ్బెనోయనరమణగాంచె.

---

* ఉపమానస్వయ † వక్రాభిజగ్య ‡ వికస్వరతల్ సిలతంపు.

క. పంకజముఖికను కాటుక, పంకజలోచనుని మోవిపయి నవ్వేళం
బొంకమయి కనఁగనొప్పెన్, మంకెనవిరిమీఁద మెలఁగు మధుప మనంగన్.

గీ. సాంజనాతిచతేక్షణాసంగమమున, నతులరాగాధరము కప్పునందె నపుడు
సాంజనాతిచతేక్షణాసంగమమున, నతులరాగాధరము కప్పు నందు టరుదె.

గీ అబ్జహితనందనామణి యనుభవింప, మరుఁడు మాధుర్యరసముంచి మషినిజాంక
ముద్ర యిడి నిల్పు రాజిల్లు విద్రుమంపు, నాళమననొప్పెఁ గాటుకనలుపుమోవి.

ఉ. కాటుకకప్పు మోవిజిగి గాదిలినవ్వుకు బొత్తుఁ గూడుచుం
గైటభదైత్యవైరిముఖకంజమునం దనరారెఁ జూడఁగా
*మూఁటికి సాటియైన రసముఖ్యము లాదిమశోణశుభ్రముల్
మేటిప్రబంధరాజమున మేళన మంది మెలంగుకైవడిన్. ౧౨౬

మ. తొలుత న్నందునియింటిలో మెలఁగి నీతోఁ బుట్టు కాళిందితీ
రలసత్కాననభూమి గోగణము సంరక్షించి తీమీఁద నీ
వలచుం జెక్కిటఁ గేళిపత్త్రమకరీవారంబు పాలించెదం
గలకాలంబును శౌరిపాల్యమె కనంగా నోఁచితిం గోమలీ. ౧౨౭

గీ భవ్యగండద్వయికిఁ గేళిపత్త్రములకుఁ, బొందుఁ గొనఁగూడదన్యోన్యభూషణంబు
పుట్టు మొదలుగ బలుగండములకు నోఁచు, నట్టియవిభూషణతకర్హ మనఁగనగునె.

గీ. అతులవాసన నచలభావానుభూతి, ననుమార్దవగుణమున నప్రతీత
తాళతళ్యంబుచేఁ గదా తరళనయన, గలిగె నీచెక్కులకుఁ జంద్రఖండసంజ్ఞ.

గీ. అసితపక్ష†లగత్తుహినాంశుఖండ, తుల యొసంగిన నమృతంబు దొలుకవలదె
కలిమిలేములు దెలియంగవలయు మాకు, ననుచుఁ జెక్కిలి నొక్కె శ్రీహరి ముదమున.

గీ. మించుటద్దంబు నీచెక్కు మించునంచు, నెంచుకొనవిందు నదినిజమంచు నెంతు
నిందుబింబాస్య నామొగంబిచట నిలువ, నమలినచ్ఛాయ ప్రతిబింబమబ్బె నేని.

గీ. ప్రకటదర్పణరుచిరేందుశకలములకు, నువిదనీచెక్కుల(కుఁ)బౌనరుక్త్యమనుచు
బుధులుపల్కు దురిటదోషబుద్ధి వలదు, శాస్త్రమరయంగ విస్మయస్థానమగుట.

చ. నిటలతటంబునన్ మెలఁగు నిద్దపుఁగస్తురిచుక్క‡బొట్టులోఁ
గటికికళంక మాననుచుఁ గ్రమ్మితిఁ జుంబనవాంఛ సంశయం
బటమటమే కలంకపద మంచితలక్షణమే వచింపఁగాఁ
గుటిలవినీలకేశి యని కూర్మి నొనర్చెను జుంబనం బటన్.

క. *పాయదు నంహస్ఫురణము, బాయద సంకాశరూపభావాస్పదతన్
†ఏయనువు మంగళమహా, శ్రీయసనత్యోక్తి యమరెఁ జెలి వీనులకున్.

ఉ. ఇంచుకయేని లీలఁ గొన దీకఁబు వీనన కేఁగుదెంచి నీ
యంచితనేత్రముల్ దఱుమ నంతికకర్ణమహాధుసన్నిధిం
బొంచెను భీతిఁ గూపములఁ బొందవు నేత్రము లంచు మీలస్ర
క్కించినవాని కట్టిభయకీర్తన మొక్కని కాచె నన్నృపన్. ౧౩౫

ఉ. కర్ణవతంసనామ మిటఁ గాంచెద దృక్ప్రభ నంచు విచ్చి య
భ్యర్ణము సేరెఁ గావలయు నద్దిర యాయసితోత్పలంబు దృ
గ్వర్ణపరంపరాంతరధిగానతఁ గైకొని లీన మయ్యె ని
క్కర్ణమునందు భూషణ(త) గైకొను నేకరణిం గృశోదరీ. ౧౩౬

గీ. కర్ణమునఁ గల్వ కనుచాయఁ గప్పుకొనఁగ, మీలితంబయ్యెఁ గంటివేలాలితాంగి
యింతిసామాన్య మిచ్చట నేలకలుగు, మహితధర్మవిశేషసంబంధ మెడయ.

గీ. బ్రహ్మమనఁ బోవు శ్రుత్యంతలక్ష్య మగుచుఁ, దనరు నిక్కల్వ శ్రుత్యవతంస మగుచు
నుపనిషద్రీతి నిది మన కొప్పఁ బలుకు, వేత్తృవేద్యంబులకు భేదవిదళనంబు.

గీ. తన్వి యీకల్వ శ్రుత్యవతంస మగుచు, నాత్మరూపంబు లక్షింప ననుచితంబు
ఇచట రూపంబు లక్ష్యత నెనయ దెట్లు, దృష్టివిక్షేపమున నది తేటపడదు.

చ. కలువలు వీనుల న్నెలఁగఁ గారణ మేమి విభూషణంబుగాఁ
బలుకఁగ సాహసంబు గద భావము నీయది యేమి తెల్పవే
తెలిసెను గల్వ కన్నులకుఁ జేటల సాటగునంచుఁ బల్కుచోఁ
దెలివికిఁ దప్పువారలకుఁ దెల్పఁగఁ జెంతల వాని నుంచితే. ౧౪౦

క. అతినిమ్నశ్రుతికూపం, బతిపూర్తిగ మెలఁగి పైకి నడరుశుచిరసం
బతితీవ్రత వెడలించిన, గతి నున్నది వీనులందుఁ గలు వోఁచెలువా. ౧౪౧

చ. సురుచిరహీరనీలముల సొంపగు కమ్మలకాంతిధార యే
కరణి వెలుంగుచున్నయదొ కంటివెఁ దామరకంటి శ్రోత్రకూ
పరమణమాధురీరసము పైకిఁ గడంగుచు జాలుసూపె జ
న్యరసముతో ననం దగియె నం చొగి నంటెను రెండువీనులన్. ౧౪౨

---

* బాయదునఘస్ఫురణము — † యొసయవు

గీ. మృదుతనవికలభావత మెఱసినట్లు, వాదులకు నెల్లఁ బ్రాపమై దగుచునుండు
నీదు కెమ్మోవి యధరాఖ్య లేదు ముఖ్య, వృత్తి విపరీతలక్షణ వెంచి యనిరి.

గీ. అతివ నీమోవి యపవర్గమగుట కేమి, కారణంబు గల్గెనది తేటగా వచింపు
మార్గ తెలివబ్బె నదిపరమామృతంబు, గాన నపవర్గభావంబు గలుగఁ దగదె.

గీ. గరిత బింబోష్ఠి యను పేరు గలదు నీకు, నచటనుపమావాచకం బంద్రుబి బ
శబ్ద మస్మాటసిద్ధాంతసరణి సారము, బింబమిది శేషమునకుఁ బ్రతిబింబముగను.

క. మృదుతన సత్కృతిరసనన్, వదతం దనరారి సత్రపబంధమ్మునఁ దాఁ
బొదలి యును హాసపదతన్, వదలదు చిత్రంబు నీదు వాతెఱ కంటే.

గీ. వెలఁది నీమోవి యపవర్గవృత్తిఁ గాంచుఁ, బల్లవచ్ఛాయ రాగసంపదలఁ బొదలి
హాస్యపద మగు నపవర్గ మబ్బుటరుదు, పల్లవాకృతి రాగసంపదలు పొదల.

ఉ. ఇంతిరో మోవి చంద్రుని మయూఖము సోఁకనియట్లుఁ గెంపుమో
వంత సుధారసం బనఁగ నధ్యవసాయ నహిష్ణుతాగుణా
క్రాంతము గాదొ తద్రసము కాదగునో యమృతంబుఁ గొంటిమ
న్నింతిది నిర్ణయింతు మని యింపుగఁ జేసిను జంబఃక్షతుల్. ౧౮౭

క. కెంపును మోవి లత్తుక, కెంపు ఘనం బమ్మెయి మిగులఁ గీల్కొని నెఱడా
లిం బగు విడెమున మిక్కిలి, సొంపెసఁగెను రాగమహిమ సురదక్షతులన్.

క. నగుచాయల ముఖముల్యము, జిగితోఁ బలుగంట్లు నిండి చెన్నలరారెం
దగుమోవి యిందువలనం, దిగజారుచునుండు మేలు దివ్యాన్న మనన్.

క. మృదుపదమై రసవాసన, లొదవి లసత్కావ్య మనఁగ నొప్పెను నధరం
బుదితరసోత్కర్షంబై, ముదమొనఁగెను వ్రణము గుణాతమొనయుం గాదో.

క. ఆమూలచుంబితంబై, లేమ రదచ్ఛదము పూర్వరీతి స్నిగులక
శ్రీ మెఱయుఁగ సంస్కార, వ్యామిశ్రితమంగళార్థ మన సంశయమే. ౧౯౨

క. చ్యుతసంస్కార మపాకృత, మత మనుకృత మగుట దోషమతి యనుచితమే
యతిచిత్రము మృదుపదమై, యతివకుఁ బలుఁదెర యా వాక్యమగుటఁ దలంపన్.

ఉ. మంకెనపువ్వుఁ దేనియలు మాటికిమాటికిఁ గ్రోలి సొక్కుచున్
శంక యొకింతయుం గొనక శాతరదక్షతముల్ ఘటింప న
వ్వంకకు డాయుఁ గృష్ణమధుపం బిదె చూచితె నాతి యన్న న
వ్వంకజగంధి మాటుకొనెఁ బంబినభీతిని మోవి కేలునన్. ౧౯౪

క. అలఘువిలాసత గానా, కలితాజరభాంచితత్వగమకతగా నే
వలనునఁ జంపకమాలా, లలితత్వము నీకు నాస లాగెం జెపుమా. ౧౮౮

గీ. సుఖదమరుదంచితస్పర్శశోభితంబు, సవ్యవహితస్ఫురద్రసం బపరమంబుఁ
గైశికీవృత్తి యన నాస గడు వెలుంగు, నొకసరంధ్రత వదలక యుండుఁగాని.

గీ. మధురిమంబున నీమోవి మధురిమంబు, శంకపడఁజేయు నాసికాచంపకమున
వెడలి మొకరించినిలిచినవిమలమాక, రందబిందువునాముత్యమంద మొందె.

క. బిత్తరి నీనేత్రంబులు, ముత్తియపుంజిప్ప లనఁగ ముద్దుగులుకు నీ
ముత్తెము జన్యము గాదా, హత్తినప్రేమమునఁ జూడ నర్హము గాదా.

చ. అని వనజాక్షుఁ డంచితముఖాంబుజహాసమరందపాళితో
మనమున రాగసంపద యమందతఁ జెందఁగఁ జిన్నసవ్వుతోఁ
బెనఁగొని ముత్తియంబు నొకవింతయొయారము దాల్ప నాసనా
ఖని యగు నాసపై వదనకంజముఁ జేర్చుచు మాటిమాటికిన్. ౧౮౯

గీ. ఈవిధ మద్భాహుసంవాసయోగ్య మగుటఁ
బ్రతిభటస్ఫూర్తి సైఁపనిప్రభలు గొనుట
వేడ్కఁ గంఠంబుఁ గనఁగ నివ్వేళ నాదు
పాంచజన్యంబు మదిలోనఁ బాదుకొనియె. ౧౯౦

క. సతి నీమకాలికి నుపమే, యత యర్హామె యొక్కభంగి నది యొప్పంగా
నతిమృదుతన్ సుస్వనతన్, వ్యతిరేకం బకుచుఁ బలుకు నది చిత్రంబే.

గీ. కలిగికలుగమఁ లగుఁగదా కంబువునకు, నాత్మరూపప్రబోధంబునందు నెపుడు
గాన జడమగునది యెట్లుగాంచుసాటి, యాత్మరూపప్రబోధంబునందు మెడకు.

గీ. అర్ధనిద్రాన్వితం బగు నారకంబు, పతివ నీకంధరకుఁ జాల నలికి యలికి
యట్టిదానికినుపమానతాస్వయంబు, గగనకుసుమంబుతో మైత్రి గాంచుసుమ్ము.

ఉ. చుంబితమై రొదల్ నెఱవఁజొచ్చినకంబువు*తోడిసాటి కం
ఠంబున కందఁజేసెదఁ గటా కట †మచ్చికయూని పల్కుచో
క్షంబుగఁ బల్లఁగాఁ దలఁపుఁగాంచి యకార్యము గాక కార్యమే
కంబువుసాటి కీర్తికరమే యది తీయగఁ బల్కనేర్చునే. ౧౯౧

గీ. సరసిజానన నీకంఠసరణిఁ దెలు(పు), ప్రస్ఫురద్వర్ణమాధుర్యవచనములకు
సాటియగు నెట్టు తతవాద్యజాతరవము, మధుగమేనియవర్ణతమానదెపుడు.

---

* తోటిసాటి † మచ్చినమూనిపల్కుచోకంబుగ

క. ఓసరసురాల నిజముగ, నీ *సరసపుఁగొలికి వెతలు నెఱివలుకులకున్
దోసము సరియున్న రసా, భాసాస్పదసుకవి కాదివత్షిన్వవముల్. ౧౬౬

గీ. తరుణి తలఁప ననర్థచేతనత నుండు, శుకము పికముఘనాగమస్ఫూర్తి నెసయు
మఱియుఁబికమొప్పు త్వద్ధ్వని నెఱి నెసంగు, నీకుఁ గళసూక్తి వలెనట్లుగింపుగాన్న.

ఉ. తావకకంఠనిస్సరదుదంచితభారతి సద్గుణత్వసం
భావితమైన దోషముల భాసిలు దోషగుణత్వదూరతన్
భావుకు లెన్నదోషముల కజ్జ మెలంగదు దోషహా గుణం
బేవిధిఁ బూన దిష్టగుణమే కొను నంచు వచింతు రుత్తముల్. ౧౬౭

క. నీరసములు గాన నలం, కారము లివి గావు నీమృకంఠంబునకున్
సా(ర)రసోత్కృష్ట గుణా, ధారము లగునీవచనములు తగుభూషణముల్.

క. పటుబాధస్ఫురితములు, త్కటబహుకరవస్తుసంవిధానక్షమముల్
†త్రుటితాసారా(?)రంధ్రము, లటు నీగుణములు విఘటిల్లునవి గాసామ్ముల్.

సీ. అనుకరణంబుచే ‡నగృహీతసంస్కారముఖనిత్యదోషసంస్ఫురణ మఱచి
శబ్దతత్త్వార్థవై శారద్యమున శ్రుతికట్వాదిదుష్టత కాకుసేసి
యంగాంగితాకథనాదిసాధనముల రసదోషనిచయంబు రాఁగుంచి
వ్యక్తవాచ్యార్థప్రబంధౌచితీగతి రచనాద్యవస్థాత రహిహసించి
రసికు లౌనన ద్విప్రకారత ఘటిల్లి, నాల్గువిధముల రచన మిన్నానసంబుఁ
గొంచు నీకంఠమున నిస్సరించునంచు, వినికి నాకగునది కొల్లి కనువుసామ్మ.

చ. అని వనితానురాగరసహర్షసముత్కటమానసంబుతో
వనజదళాక్షుఁ డయ్యతివబంధురపేశలకంఠనాళముం
దనముఖపద్మసంగతినిఁ దద్దయు ముద్దుఁదనంబు గుల్కఁగా
ఘనకరినాబ్జసంభరణకౌశలహస్తము మెచ్చెఁ దార్క్ష్యనున్. ౧౭౨

చ. కుచవదమండలంబున నకుంఠసజాతివిజాతిభూషణ
ప్రచయము క్షీరనీరనయభావముతోఁ దిలతండులక్రియా
ప్రచితము నొచు నద్రసము భాసిలఁ జేయుచు దోషవిక్రియా
వచనము దూరమై మెలఁగ వర్తిలుచున్నది కంటివే చెలీ! ౧౭౩

సీ. నిరుపమనానామణీచిత్రరుచిరాజిఁ దంబుమీఱిన రోహితంబుగాఁగ
భావనాతీతసల్లావణ్యపూరంబు సౌదామనీలతాచ్ఛాయగాఁగ

---

*సరసులకొలికి †త్రుటితనిస్సారరంధ్రియు- ‡నవిగృహీసంస్కా--

పత్యర్ఘ్యమౌక్తికవాఃకాళి సంతతధార వఱలొలింపఁ ధారగాఁగ
ముక్తాళిమధ్యగమోహనహీరముల్ లసమరువర్ణోపలములుగాఁగ
లలితరుచివక్త్రశశిమండలంబుదిగువ, దండిమీఱుపయోధరమండలంబు
మా(ము)కమనోరథచ్ఛలమహితసస్య,ఫలములెల్లనుమిగులనిష్పన్నములుగ.

క. ముక్తాహారము లివ్వి వి,విక్తచ్ఛాయలు ఘటిల్లి వెలయఁగఁ జేయున్.
ముక్తాపద (?) మన్యమణీ,రిక్తత గన నీసముద్ధరించినకృతులన్. ౧౭౫

గీ. పూర్వపూర్వవిశేషత పొసఁగ నుత్త,రోత్తరంబున కిది భూషణోత్తమంబు
నాతి యేకావళీభూషణంబు దీని,గన్నరసికులమది మోద మెన్నఁ దరమె.

గీ. రమణి! దీపకభూషణరత్న మిద్ది, మంజులైకావళీయోగమహిత ముకుట
మాలికాదీపకం బాచు మామకీన, మానసము నాత్మనిష్ణతఁ బూనఁజేసె.

క. *అరయ సరసత్వఘటకం, బురుతరలోజ్జీవితంబు నొప్పగుసుగుణ
స్ఫురణంబున నేకావళి, వరమాలంక్రియలలోనఁ బర్వేందుముఖీ ౧౭౮

చ. సురుచిరపద్మరాగపరిచుంబితనీలనిబద్ధహారని
ర్భరరుచిరాజి వింతకనుపండువు సేసెఁ ద్రివేణికైతవం
గర మనురక్తి నేతదవగాహన మొందె మదీయభావ మ
బ్బురమె నిరంతసౌఖ్యరమ పొందుట యిత్తఱిఁ గామినీమణీ. ౧౭౯

గీ. లేమ నెలచొత్తఁ దారావళికిఁ బ్రకాశ,మబ్బుటరుదనియెంచంగనగునెచూడఁ
దదురురోచుల నెనసి యుద్ధతపుఁజక్ర,వాకయుగళంబుజోడయిపఱలనరుదొ.

క. లాలితకుచపదమండల,మోలి నలంక్రియలు చాల నొప్పఁగఁ జేయున్
†బాల వీక్షింపు ముపమా,మాలనముల పొంకుఁగొనుట మెచ్చు తలంపన్

క. ఇక్కరణిఁ బలికి యనుపతి, చక్క నిరవణమునఁ జిక్కు సడలింపుచుఁ జన్
జొక్కపుఁబూఁగుత్తుల పై,నెక్కొనఁగాఁ జేసెఁ గన్నునెఱితుమ్మెదలన్.

క. మించి మహీధరగర్వ, మ్మడంచుట నిరమిత్రమౌ మిటారికుచంబుల్
కంచుకకవచం బేల ధ,రించెను గాళింది విస్తరించి తెలుపవే. ౧౮౩

ఉ. రంగు లెసంగుమేను మది రాణవహించుదృఢానురక్తిచేఁ
బొంగఁగఁ దద్బలంబునన పుట్టినతత్తనుకంటకంబు లె
క్కెం గడుదుర్బలం బగుచుఁ గాంచనకంచుక మిద్ది పక్కునన్
భంగముఁజెందెఁ గన్గొను మభంగురలోలకటాక్షవీక్షలన్. ౧౮౪

---

*అరస †బాలావీక్షిం-

గీ. చక్రవర్తిత గొని యరిచక్ర మణఁచి, కటుమహాభోగమున నురోభద్రపీఠి
రాణఁ జేకొను భూధరరాజమునకుఁ, గోకచాటున మెలఁగంగఁ గొదవగాదె.

క. ఎడకుడిగి కూడ ముఖశశి, నడఁచి జయింపంగఁ దలఁచు ననుచును జెలువా
కడుఁగందుకజాలములోఁ, బడనిడి కుచకోకములను బంధించితివో. ౧౮౬

శా. కాంతాపీనకుచంబు లాకృతిచమత్కారంపుగూఢధ్వనుల్
కాంతాసన్నిభశక్తినం చొగి నలంకారజ్ఞు లూహించు దృ
ష్టాంతవ్యాప్తి సార్థకంబుగ మదిం జాల న్విచారించి యో
కాంతారత్నమ కంచుకాకృతిఁ బహిష్కారించితే గుబ్బలన్. ౧౮౭

గీ. నడుమనెడుమిన్నపైఁ దన మెడయ కెనయ
ఘనఘనత్వంబు ఫలమయ్యెఁ గాని సూక్ష్మ
సూక్ష్మత ఘటిల్ల దని యెజ్జ సొగియు నవిక
చాటు కుచమందె నో యది నంది నరుదె. ౧౮౮

మ. అతిసూక్ష్మం బగుటన్ రహస్యతమమే యౌఁగా స్వరూపంబు మా
నితిగా దానిఘనాంగతం గొనుచు మన్నింపంగదా సౌఖ్యముల్
సతి నీగుబ్బలు గొప్పగొప్పలగుఁగా స్వాయత్తసంరక్తికై
యతిగోప్యాకృతి మాని యుండు టరుదా యాత్మ న్విచారింపుమా. ౧౮౯

మ. అలగూఢధ్వనికి న్నిదర్శనము దా నౌచుం జెలంగుంగదా
బలుచన్నుంగవ మున్నె నే నిపుడు తద్భావంబు సైఁప న్మను
జ్జ్వల*రీతిత్వము నీవు మెచ్చుకొన సంపాదించెద న్గంచుకా
కలనం బాఁపుచ గూఢమైనధ్వనితో గారాపుసాదృశ్యమున్. ౧౯౦

గీ. అనుచు హృద్గతతద్గ్రంథికపుకువికల, భావమొనగూర్చికంచుకావరణముడిపి
వరమకారణ మగువేల్పు బయలుపఱిచె, సత్కుచాత్మస్వరూపంబుచాలఁబ్రీతి.

క. కలికి చిననాఁడు చేతికి, బలుగుబ్బలి మేలుపూలబంతి యగుంగా
యలచేతి కిపుడు కుచమిది, బలుకొండై మేలపూలబంతియు నయ్యెన్.

గీ. మేలుబంతుల నెల్లను గెలిసేయుఁ
బ్రాయమొక్కినకొలఁది నీబలుకటికిత
నంబు గొను సూక్ష్మమొక్కగుణంబు సొరగ
నెనయు దపకాశసద్వృత్తమెట్లు కుచము. ౧౯౩

---

*రీతిత్వము

ఉ. కొండలనైన లేఁతవిరిగుత్తులకైవడి మీఁట రాజవే
దండముఁగండముల్ విరియఁ దాఁకఁగ దక్షతగల్గి మీఱి యొం
డొంటిని డాసి మా తెఱుఁగకొండెడు కోడెమిటారిగుబ్బలో
యండజయాన హస్తగత మయ్యెడుసూత్ర మదెద్ది తెల్పవే. ౧౯౭

క. పాలిండ్లు మరగి తిరిగి(తి,) హేలావతి(చి)న్నయప్పు డిప్పుడు నీమే
ల్పాలిండ్లు మరగి తిరుగఁగఁ, బాలయితిం గదవె కోర్కె ఫలియింపంగన్.

గీ. మగువ ! యేతత్పయోధరమండలంబు
బర్హాధరహర్మ్యత్వమోదంబు బలియఁజేసె,
మదిరనేత్ర పయోధరమండలంబు
బర్హిఃఖన్మోదహేతువై పరఁగు టరుదె. ౧౯౮

క. గురుశుశ్రూషణ మవనిం, బరమసుఖం బిచ్చు ననుచుఁ బలుకుదురు బుధుల్
గురు(ప)కుచరశుశ్రూషన్, నిరతిశయసుఖంబు మాకు నెలకొనదె చెలీ

గీ. అదరి ద్విజరాజచక్రంబు డాఁకఁ జేసి, కృష్ణమలతరసుమనఃపఙ్క్తు లోడఁగఁజేసి
మిగుల నుద్ధతిగొన్ననిమెఱుఁగుగుబ్బ, మగువ మర్దింపఁ గుచమాకు మానఁదగునె.

సీ. కుచములు గిరులన్న గొబ్బునఁ బరువత సాదృశ్యహేతువై చాలఁదోఁచుఁ
దోఁచిన మృదుతనూద్భూతకుచంబుల కదియైన వైషమ్య మనెడుశంక
బలుకుచంబులు పూలబంతులైన మృదుత్వముచ్చటఁ గారణం బనెడు తెలివి
వివరింపఁ దత్తల్పశయనతకవకాశ మంబరకుసుమంబ యనెడు మనసు
కేలఁగైకొని మదిఁ బరీక్షింపఁ దెలియుఁ
బరువభావమృదుత్వ*సద్వర్తులత్వ
పీనతౌన్నత్యములఁ గొన్ని భేదము లిటఁ
గరణములు మాటికని చన్నుఁగవ గ్రహించు. ౧౯౯

మ. బలుకొండొక్కటి యున్న నాకరమునన్ బాగైనపూబంతివా
విలసించుం గద మేల్కుచంబు లివి యీవేళం గరాయత్తత
స్వాలయ న్మార్దవమేని తత్సదృశత న్నిర్మింతు నక్కొండ క
స్తలఁబొల్పున్ జనియించె నంచు హరి మిన్నాగుబ్బ లొత్తుం గడున్. ౨౦౦

గీ. అతికఠినపీనవక్షోజహద్వయి యావి, మర్దనము చేసి చేసియు మఱియు మఱియుఁ
గాంక్షవడు నాడు హృత్కహాసరకంజమింతి, చిత్రమిది యనికుచపీడ సలుఁగఁజేయు.

---

*సద్వర్తులత్వ-

సీ. జోడువాయక కూడి జొబ్బిల్లెడు సుగంధభూరిపంకంబున బ్రుంగి బ్రుంగి
కమనీయకుసుమసంగ్రథితకందుకముల నలరులీలల వాడ నాడియాడి
గురుతరమత్తేభకుంభస్థలంబుల నెఱినాక్రమింపంగ నిక్కి నిక్కి
యతిఘనాత్యున్నతాహార్యరాజంబులఁ దడవు కత్యుద్ధతి దాఁటిదాఁటి
శ్రమజలం బూర నొక్కింత చక్కనిలుచు
కుచకిశోరంబులను జూచి కోర్కె మీఱ
ముద్దుగొన *మనసూట్టెడు ముదిత యనుచు
ముద్దుఁజనుదోయి శ్రీపతి ముద్దుఁగొనియె. ౨౦౨

గీ. చంద్రుఁ డొక్కఁడు బాధింపఁ జక్రయుగళి
యింతముఖ నీదుగుబ్బలై యెనసి యిపుడు
చూడు బహుచంద్రభూషణస్ఫురిత మయ్యె
ననుచుఁ గుచముల నఖరేఖ లంటఁజేసె ౨౦౩

క. నెల యొక్కఁ డేచ జక్కవ, లలికుంతల నీదుకుచములై జనియింపం
గలిగెఁ బహునఖచంద్రా, కలితశ్రుతిపీడ యని నఖంబులు నాటెన్. ౨౦౪

గీ. సర్వగురుచిహ్నములు గానిచన్నుదోయి
సర్వగురుభావ మెఱుఁగంగ శక్య మగునె
యనుచు గోవిందుఁ డానంద మతిశయింప
లీలఁ గుచముల బాలేందురేఖ లిడియె. ౨౦౫

క. హరినఖపదచిహ్నిత మౌ, సురుచిరకుచకుంభయుగళి చూడఁగ నొప్పెన్
వరశుకశితముఖదారిత, పరిపాకమనోజ్ఞలికుచఫలయుగ మనఁగన్. ౨౦౬

చ. గిరులకుఁ జిత్రపత్రలత గీల్కొను టబ్రమె కప్పురంబుచేఁ
గరము మెఱుంగులీనుమృగగంధ మలందఁగఁజేసి తెల్లడా
ల్గిరులకు సాటిఁదెచ్చి యటఁ గేళివసించు శివుండ నయ్యెదం
దరుణి యటంచు నించు హరి తత్కుచసీమ సుగంధపత్రముల్. ౨౦౭

చ. శుకము మహాగమాంతరతిఁ జొక్కికి నింపగు దాడిమీఫలం
బకట పునర్విదారణము నందెడునట్లు ప్రయత్నమూనె నా
మొకము సమందహాసమయ ముద్దులు గుల్కఁగఁ గొమ్మ పైఁడిడా
ల్చకచకలూరుపయ్యెదను జక్కఁగఁ గప్పెను బొమ్ముఁ గ్రక్కునన్. ౨౦౮

*మనసుపుట్టెడు.

క. అతిశయపోన్నతవృత్తిం, బ్రతిలేకుండియును మధురరసమేరీతిన్
సతి నీకుచపదమండల, మతిచిత్రము మధ్యవృత్తి యగుచుం జెలువున్.

క. గేయ మగు చేకగురుతో, న్నేయంబై సర్వవృత్తనిచయాద్యంబై
పాయని గా శ్రీవృత్త, శ్రీ యాపక్షోజయుగము శృంగారవతీ ౨౧౦

క. పరుషంబు లగుటఁ గుచకుటలు, సరళ బులు గాక యున్న సఖ చిత్రంబే
స్థిరము లగుచున్న వజ్రము, వరమాణుసమానమధ్య పరికింపంగన్. ౨౧౧

క. ఈకుచపదమండలమున, శ్రీకరభావమున పొలఁగు చెలువౌభావల్
శ్రీకర ముభయశ్లేష మొ, కోకస్తని చాలఁజాల గణుతుఁగఁ గంటే. ౨౧౨

చ. మదభిమత(ంపు)శయ్యయయి మానితభూషణ మై యదోష మై
ముద మొనరించుఁ గావ్య మన ముద్దుఁగుచద్వయి చిత్ర మొక్కఁడే
పదములగాత్రి సద్గుణము చాలఁగ సూక్ష్మతఁగాంచియేని దాఁ
గదిసి సొరంగ నంది యటఁ గానఁగ శక్యముగాదు చూడఁగన్. ౨౧౩

క. ఈరీతిఁ గుచము లెన్నుచు, వారిజలోచనుఁడు కాంతివారస్ఫురణా
ధారము లగుదోర్మూలా, కారావారములచాయఁ గనుమీా లడరన్.

చ. చెలి కరపల్లవస్ఫురణఁ జెందినదోర్లతికాలవాల మై
యలరెడుబాహుమూలముల కర్షము ఖాతము లేదె పూతచే
వెలయఁగ బాగుగా యనుచు వేడ్క నఖంబులు నాటెఁ గడున్
విలసదనూనబాహువుల వేమఱు గందపుఁబూఁత దానిడన్. ౨౧౪

క. అరుఁ గనుఁగొనియె శ్రీహరి,యారుచి ముద మొనరఁజేయ హారిరత్నపుమే
ల్చేరుల జలిచీమలబ, ల్బారుం గలహింపఁ బిలువఁబంపెడుదానిన్. ౨౧౫

గీ. విన్నకానునఁ బొక్కిటివేల్పుబావి, లేమ యాచెంత మధుకరాలీఢమగుచుఁ
గలదు పేశలరోమాళికల్పవల్లి, విబుధపదు లగుమాకొగి వేడ్కఁజేయ.

గీ. అతివ యున్నంతమేనికి నహివరేణ్యుఁ
డభిమతంబైన తల్పమై యలరఁజేసె
నిపుడు రోమాళిభుజగేంద్రుఁ డీకరాబ్జ
మునకె తాశయ్య యగుచుఁ బల్మిడ మొనర్చె. ౨౧౭

క. మాయానరేంద్ర మాత్రే, చ్ఛాయల రోమాళిభుజగచంద్రుఁడు మిగులం
జాయవహించెను జిత్రము, ఛాయాసుత నీకుఁ జూడఁ జనదే చెప్పుమా.

గీ. పరువ బంధమయం బోటఁ బరఁగు గాడ, రీతివోలెను జనుదోయి లేమ యట్లు
గానరో మాళి యను పేరు పూనుచీమ, బారు వయి కెక్కు నాభిగహ్వరము వెడలి.

ఉ. పొక్కిటి కోమ నుండి వలపుం గిరులం చుఁ గుచంబు లంటఁగా
గ్రక్కున నిక్కు నీలఫణి రా జోళ్ళా పొక్కిటి పాదు నుండి పెం
పెక్కఁగ నిక్కు చుణ్ బయట నెంతయు స్రుక్కుచు గబ్బిగుబ్బలన్
జొక్కపు కొండలం చడరి చొప్పడు తీవయొ యిద్ది దెల్పవే. ౨౨౧

గీ. రమణి మంజులరుచిరోమరాజి భుజగి, తరుణకృష్ణభుజా దంశద దశూక
రాజు తను గూడ నెంతే నిరమణఁ గాంచెఁ, జూచి తే ముద్దుఁ దెలితేట చూపులాఁడి.

క. ఆతల నీతల దేశము, లేతటి నైనన్ సమృద్ధి నెనయఁగ తూమా
పేర మగు మధ్యదేశము, ఖ్యాతిగ నిట నహిభయంబు కలుగుటకతనన్.

క. కాళిందిమధ్యగత మగు, కాలాహి న్నాదు పాదగతి మర్దింపం
జాలితిఁ గరమున నిపుడీ, కాళిందీమధ్యగాహిఁ గడఁగితిఁ బెనఁకన్. ౨౨౪

క. అండఁగొను వారి భూధర, మండలవతు లగుట మిగుల మహిమంబులచే
నుండుకొన మెండు లేమిడి, యండగు వారల*ను బీడయంటఁగ సాగెన్.

గీ. కన్నరో కంటివే నీమ చిన్న నడుము, మిన్ను ముట్టిన కలిమి చేకొన్న దేని
మొన్న నబ్బుర మిద్ది దానున్న దిక్కు, నెట్టి నెఱవాదులకు నేని యెఱుఁగనీదు.

ఉ. ఊరుకుచభూధరంబులకు నొప్పుగఁ బ్రాకులకాను వత్రముల్
కరము దలిర్పఁ బొక్కిటిచో కాటపు బొడ్డన బావిలోని యా
ద్యరసపు జాలనా మిగుల నందముఁ జెందెడు రోమరాజి యం
చరుదు ఘటిల్లఁగాఁ బొగడు నచ్యుతుఁ డా రొగిఁ గేల నంటుచున్. ౨౨౭

ఉ. విప్పగు నాభిదీర్ఘికను వెల్వడి మీఁదికి వేగఁ బాఱు మే
ల్పొప్పురసంపు జాలుగద గట్టిగఁ జొక్కపు రోమరాజి యం
దొప్పగు లేఁదరంగలర యొద్దతదంతుర రేఖలో కదే
యొప్పులకుప్ప యీవళు లవలో యని మాటికి నంటు మువ్వళిన్. ౨౨౮

గీ. కాదు భావంబు దృష్టికిఁ గానరామి, పటుకుచద్వయిఁ బూన నభావ మెట్లు
నాతియటు గానసుభ యభిన్నంబు కౌను, మత్స్వభావంబు గనుట చేనూకుముద్దు.

క. సర్వద్రష్టను నేనను, గర్వం బిఁక మూకుఁ గలదె కనుపట్టదుగా
సర్వేందువదన మధ్యము, సర్వపదార్థాంతరాళ సంగత మయ్యున్. ౨౩౦

*నవీడ కట్టుగ సాగెన్.

గీ. సత్త్వ మొనగూడకున్నను జాన నడుము, విష్ణుపదపదమయ్యెడువిధముపిదప
విష్ణుపదపదమయ్యెడు విధములేదు, సత్త్వ మొనగూడననినవ్వుఁ జక్రధరుఁడు.

క. ఘనజఘనకుచపదంబులు, కనకమ్మను గురువులగుచుఁ గమలదళాక్షీ
కన వింత మధ్యపద మిది, కనుపట్టెను లఘువిలాసఘటితం బగుచున్.

సీ. బలుకొప్పుకార్మొగుల్ బాగుగా ధరియించి తులకించువదనచంద్రుని భరించి
గంధిలనిశ్వాసగంధవాహముఁ బూని తనరారుకుచపర్వతంబు లూని
తన్మధ్యసంధానితనభంబు గైకొని పంచభూతమయప్రపంచ మూని
సూక్ష్మాతిసూక్ష్మ మై చూడ్కికిఁ గనఁగాక మాయాభిరామమై మహిమఁ గాంచి
తనమహాకాశపద మొప్పఁ దనరు నడుము
పరమసూక్ష్మత మను విష్ణుపదతఁ గాంచు
నిపుడు మద్దేహసంగతి నెనయు మిగుల
విష్ణుపదభావ మని కొనుఁ బిడికిలించు. ౨౩౩

గీ. వెలఁది తారుణ్యరసమహావేణియందు, బంధురావర్తమై స్వర్ణపద్మమయ్యె
నతిగభీరమహాహ్రదంబయ్యె మెలఁగు, వేడ్కఁ గనుఁగొంటివే నీదువెడఁదనాభి.

చ. కలితతనూలతం గలవికస్వరనాభినుమంబులోపలన్
మెలఁగుచునుండి మీఁదటను మేల్వలపుల్ గులుకం దదుద్భవో
జ్జ్వలకుచగుచ్ఛముల్ గొన నవారణమైఁ బయికెక్కెఁ బిల్లతేఁ
టులజిలిబారునా జిగిఁ గనుం దనరారెడు నారుఁ గంటివే. ౨౩౪

గీ. కాంత యేలోకమునవైన గగనకుసుమ
దర్శనము సేయ నొకఁడైన దక్షుఁ డగునె
యిప్పు డీమింటఁ గనుఁగొంటిఁ దప్పుగాదు
చారుభాస్వరవికసదంభోరుహాంబు. ౨౩౫

క. శృంగారరసం బిచ్చటఁ, బొంగదె మధురంపుగుణము పొలుపారఁగ నో
యంగన మధ్యమవృత్తి కె, సంగదె మాధుర్యగుణము సంశయ మేలా.

క. పునరుక్తివలెను నుడికిం, గనవమ్మను నాభి మించు గడురూపమునం
బునరుక్తపదాభాసం, బనఁగ నలంకృతుల నెఱుక నందుట లేదే. ౨౩౬

గీ. పంకజాతాక్షి యీకరపంకజమ్ము, చొరఁగఁ దలఁచెను దాఁబరసుఖముఁ గోరి
చెలువుమీఱెడు నిమ్మహాబిలబిలంబు, నన్యకార్యసమాసక్తి యంత వదలి.

మ. అలమింటన్ సురదీర్ఘికం దెలిగజా *బాత్మాయతాంచత్కరం
బెలమిం జాఁచుచుఁ గ్రీడసేయఁగద కృష్ణేభంబు కాన్మింట నీ
చెలువంపుంబలుడిగ్గియుం బ్రమదియై చేసాఁచి క్రీడింపఁగాఁ
దలఁచెం జూదితె యంచు నాభికడకుం దార్చెం గరాంభోజమున్. ౨౮౦

మ. హృదయగ్రంథి మహాదృఢం బవ్వఁగదా యిప్పాణ్యు నీక్షింపఁగా
వదల న్నె నొకలక్ష్యమా యతనికిన్ భావింపఁగా నంబరా
స్పదమా గ్రంథిత నాస్వభావ మనుచుం బాటిల్లుభీతిం గడుం
జెదరె న్నీవి మనోహరాంగి కనుచుం చిత్తంబులో నెన్నవన్. ౨౮౧

క. ముడితోడన వడిమీఱఁగఁ, గడుసాగెం గటి నెసంగుకనకాంబరమున్
సుడివాలుదాల్పుధైర్యపు, ముడి సాకల్యంబుగాఁగ ముద్దుగ జాఱెన్.

ఉ. అత్తఱిఁ జిత్తజుం గనినయట్టిమహాత్ముఁడు రత్నభూషణం
బొత్తు నటంచు నాత్మమృదులోజ్జ్వలచేలచెఱంగు మెత్తనా
మెత్తగఁ జేసి పందిటను మేలిమిబంగరుఁబోఁడిఁ జేర్పఁగాఁ
గుత్తుక పాంచజన్యమొనగూడినచాయ నొనర్చె నచ్చటన్. ౨౮౩

క. నవ్వుచుఁ బువ్వులతూపుల, నొవ్వుచుఁ బుష్పాయుధుండు గుప్పుచుఁ దిరుగన్
దువ్వుచుఁ గటిపై †జాపుఁజు, రువ్వుచు వెచ్చుండు తిగ్మరుచిసుతఁ గనియెన్.

సీ. వివిధరత్నప్రభావిస్ఫురన్మేఖలామాయావిచిత్రత మనుటకతన
సూక్ష్మాతిసూక్ష్మత శోభిల్లుకతమున బహుగుణాశ్రయతచేఁ బరఁగుకతన
వరిత(టం) దనురోచు లడరించుకతమున నర్హాజనంబున నబ్బుకతన
మాలిన్యలేశంబు మలయనికతమునఁ గటిసుప్రపంచంబు గ్రమ్ముకతనఁ
దరుణి మామిత్ర మీమహాంబరము గానఁ
దనకుఁ దా విడి మాకుఁ హితం బొనర్చె
మేము చేసినవని గాదు లేమ మాకు
నేర మించుకయును లేదు నీవు గినియ! ౨౮౪

గీ. భామ కర్ణావతంసాదిపదములందు, జఘనకాంచిసమానగజఘనపదము
గణితమై యున్నదో కాదొ కలిమి లేమి,నీ వలంకారవతివిగా నిశ్చయింపు.

క. విరసంబై కనుపట్టెను, సురధునిసికతామయంబు జో డనఁ దగు నే
వరమాద్భుతసుమమారస, మిరవొందఁగఁ గానన్నైరయియాకటితటికిన్.

---

* బాత్మాగతాంచ † మాపులు

గీ. అతివ కాంచి గుణస్థాన మగుటకతన, నేతదుజ్జ్వ పరదరాజేష్టవాస
మొట్లు గాకుండు నిటవసియించు మనట్టి, వరమపూరుషు డతనుతాపంబుగొను న
గీ. చామ యీకటిభూధరచంద్రమునకు, లీల భూచక్ర మంతయు నేలఁజాలు
భాగ్య మొనగూడ గిరిదుర్గపాలనంబు, పులినదేశంబు నేలుట యబ్బురముగాదు.
క. ఈ కాళిందినితంబము, జోకై మాక్రీడ నమరఁ జూపెను మదిలో
నా కాళిందిమనోజ్ఞత, రాకృతిపులినస్థలీవిహారము లెల్లన్. ౨౫౦
గీ. అపదసౌందర్యమై కటి యుపహసించుఁ
బ్రాకృతవ్యాకృతిని జిత్రరసముఁదోఁచు
నొక్కయెడ నద్ది పురుషమత్రయోజ్జ్వలంబు
ప్రథమపురుషైకసంస్పర్శభవ్య మిద్ది. ౨౫౧
గీ. కటిపదంబున *నర్థసంఘటిత మగుచు, జఘన మభిధకు సాటియౌ సన్నితంబ
మాత్తపశ్చాన్నిరూఢిమైయుందులత్, నాభికావ్యంబు రుచిగాంచి వ్యక్తిఁబోలు.
క. నిరుపమసంభ్రమ మొదవఁగఁ, గరిగామిని కుంచితంబు గావింతు నిటం
బరమాద్భుతరస మొదవఁగ, వెరవు దలిర్పంగ †నే వివృతమొనరింతుఁగా.
సీ. పొంగుచు నీకటిరంగస్థలంబున లేమ చక్రభ్రమరిం ఘటింతు
ననుమోదభరమున నంబుజలోచన లీల ఛత్రభ్రమరిం దనర్తుఁ
గువలయేక్షణకోర్కి కొనలుసాఁగుచు మీఱుచుద్వృత్తమునఁజాలనొఱపుగాంతు
నురుతరమై రాగ మొదవ నున్నతవేణి రథచక్రచారిత రమణనింతు
నతివ యిట్టు హరిక్రాంత మైయొనంగ, జతనపడుచును వైష్ణవస్థానమై ఈ
నంగ‡ వ్యావృతినొందచుఁ జతురవృత్తి, మెఱయు నీవేళ నీచేత మెప్పుగొందు.
క. ఈరీతి వచింపుచు హరి, చారుదతీపీనజఘనసంగమమోదా
కారపయోనిధి నీఁదఁగ, నేరీతి న్వెఱపులేక యెడమెలఁగంగన్. ౨౫౨
క. ఊరువులందుచుఁ దద్గత, చారువృత్తత్వంబుఁ గాంచి సరసకదళికా
కారంబు లధికకఠినవి, కారము లని మనసు సాక్షిగా నిట్లనియెన్. ౨౫౩
గీ. లలన(నీయూరు) యుగళిపేశలతవలనఁ, బరిభవముఁజెందఁ గదళి కాతరువనంగ
నయ్యె నచ్చట సమసనార్థాంతరంబు, లోకవిభ్రాంతిమూలంబు గాకయున్నె.
గీ. తరుణి యూరూత్తరపదోజ్వ్వధాయకత్వ
మొందు యోగంబునఁ ద్వదూరుయుగళపర్య

* ననిసంఘటిత † నేలిపృత్తమొనర్తుఁగా. ‡ వ్యావృతిగొందుఁజ

దానఁ గనఁడయ్యె ముని త్వరితంబుకతన
నబ్రమే వార్తికోక్తుల నతఁడు గొనెనె. ౨౫౮

క. అని యూహద్వయిపొందిక, కవితరసాధార(ణ)ంబు హర్షముగొనుచుం
గనకపుటాల్గి ను వేలుపు, కనకాంగిపదద్వయంబు గనుఁగొను చనియెన్.

గీ. ఆంతజ(ఘూ?)సద్వృత్తియై యులంగి, లలితవర్ణోయరీతుల లక్ష్య మగుచుఁ
దళుకులీనులలంకృతధ్వనులఁ దనరి, రమణి సొగసైన యీపదరచన వెలయు.

గీ. హారిఁ రస్పృశ్యసఁజాతహర్షవిభవ, యతులమృదురూపనీరజాతాధివాస
లక్ష్మి నీపాదములసేవ లాభుచున్న, దింతకన్నను భాగ్య మిం కేమి నీకు.

మ. అను చ(క్రి)స్వయదర్శనాగతమహాహర్షంబు లోకాళిక
ల్పనసత్యల్పవిలాసతం గొనునిజస్వాంతంబు నాత్మాశ్రయం
బన కెంతేవడి మీఁటి శ్రీధవుఁడు ప్రోయాలిం దగం గాఁగిటం
జెనయం జేసి కుచాంతరం బురము నాశ్లేషించెఁ జెన్నొందఁగన్. ౨౬౨

చ. అతినిశితంపుటగ్రముల నందెను బల్చను బొంగరంబు లు
న్నతి మిగులంగఁ దాఁక జిగిఁదప్పదురంబు నురంబు(దాఁ)కినన్
క్షతి యొకయింతలే కడరుచక్కనిగుబ్బలు రెంటిదార్ఢ్యముల్
ప్రతిఁగొన *నొక్కుఁడొక్కటికిఁ బాయనిసాక్షులు యుక్తయోగముల్.

గీ. ఘనలసద్వంశముల(ఁ)బుట్టి జనులొనర్చు, ఛిద్రముల కోర్చి శుద్ధనిర్ణిద్రవృత్తిఁ
జాలరాఁశిల్లు మేల్ముత్యసరులువిడుచు, సద్గుణంబుల నుద్ధతాశ్రయముకతన.

గీ. అంతరం బగుసార మావంత లేక
బయటఁ దెల్పులుఁగొన్న యాస్పదముగన్న
నొక్కతటి హాని యగు నని యొప్పఁబలుకు
చతులహా(రా)ళిసూత్రంబు లపుడు విరిసె. ౨౬౫

గీ. ఛిన్నసూత్రంపుముత్యముల్ చేయవేళ, నవ్యనక్షత్ర మౌవిన్ను నవ్వఁ గాదు
ముత్యములు నాభిసరసికి మొనయునపుడు, తలకు యోధర్దగళదుదస్రుకములయ్యెం.

ఉ. కంచుకనామసత్త్వచగర్భగతత్వ ముఖండసారభా
వాంచితులైనవారలకు నర్హముగా దని పీడనాడరే
కొంచెపుఁబూఁత లోడగున కూమనె కీర్తులు కార్యవేళ నం
చెంచి కుచంబుపూఁత నెడయించె ననం గడుపీడెఁ బూఁతయున్. ౨౬౭

*దొక్కుడొక్కటికి

క. బలయుతు లన్యోన్యంబును, బలవత్సంఘర్షసేయ బలమటి నడుమన్
మెలఁగెడునది చెడు ననుచుం, దెలుపుచుఁ గుచపత్రకాళి దెరలె న్నిగులన్.

మ. పతదుత్కర్షము ఖోరుదోషగుణసంబంధాభిజ్ఞత్వసం
గత మౌదార్యసుకాంతిముఖ్యగుణసాంగత్యాభిరామంబు నా
నతిచక్కదోయి యలంకృతాన్వయయుగన్ సత్కావ్యముం బోలి శ్రీ
పతిచిత్తాబ్జమునం బ్రమోదభర మాపాదించె నంతేసియున్. ౨౭౯

వ. అంత ననంతలీలాపరాయణుం డగు నారాయణుం డమ్మానవతీరత్నంబు నయ
త్నాయత్తాసాధారణాగణ్యాంగలావణ్యం బనిదంప్రథమపరిదృష్టం బయ్యు
నిదంప్రథమావలోకనసంపాదితానుపమానకుతుకంబు మనంబునకు *నా
పాదింపం దలంపులో నిబ్బరంపుటబ్బురం బాగుబ్బుకొన నొయ్యలినీలకబరీ
కబరీభారంబున నుదాత్తాలంకారంబును గలితాలికాలకంబున వక్రోక్త్యలం
కారంబును గమలాననంబున వికస్వరాలంకారంబును గన్నుదోయి నుత్ప్రే
క్షాలంకారంబును గలికానాసిక లలితాలంకారంబును గపోలయుగళిఁ జిత్రా
లంకారంబును గర్ణంబులఁ గుండలీబంధాలంకారంబును గన్నుబొమల
దృష్టాంతాలంకారంబును గమనీయాధరంబున రసవదలంకారంబును
గంబుకంఠంబున నత్యుక్త్యాలంకారంబును †గనకకుంభకుచంబుల ‡శ్లిష్ట
రూపకాలంకారంబును గనద్బాహుల మాలికాబంధాలంకారంబును గర
తలంబులఁ బద్మబంధాలంకారంబును గప్పునూగారున నాగబంధాలంకా
రంబును గనకచ్ఛాయంపువళుల విషమాలంకారంబును గౌనుదీఁగె సూ
క్ష్మాలంకారంబును గభీరనాభి నతిశయోక్త్యలంకారంబును గటితటుల
సారాలంకారంబును గరభోపమోరుల రూపకాతిశయోక్త్యలంకారంబును
గాదిలిజంఘల ననన్వయాలంకారంబును గలపదంబుల విరోధాభాసాలం
కారంబును సర్వాంగంబుల సమాలంకారంబును ధరించునింతిఁ బొడఁగవి
గావున నానాలంకారలీలామూలాస్పదంబ వయి వెలుంగెదవు గావున
ననుపమవేని సుకుమవగుటకు సంశయం బాశయంబున నుదయింప
నేర్పునే యనుచు నగుచు నవ్వరారోహ నిజకటాక్షవిశాలదొంతరారో
హం గావించి చాఁప్రొద్దు పుచ్చుకొన ననంతరంబ. ౨౮౦

* నాపాదింప † ఘనకుచంబుల ‡ శ్లిష్టోపమాలంకారంబు

ఉ. ఉత్తరశాయతాక్షి యనమాయఘపూర్వరణంబు శ్రీహృదా
యత్తునిచిత్తమాత్తకుతుకాతిశయంబునఁ జేసి వ్యక్తిగా
ధాత్తచమత్క్రియం బయి కరస్తసుశబ్దవిశేషవాచ్యమై
యుత్తమకావ్యముం బలె నదఃజ్జ్వలభావరసప్రధానమై. ౨౭౧

క. దయవడుటనో గురుజను లని, భయపడుటనో శ్రాంతి నేమొ బాణాసశరో
చ్చయమునులు గను వాడుటనో, కయి నిర్వ్యాపార మయ్యెఁ గందర్పునకున్.

చ. అలరులవిల్లు నీరసత నందఁగ నాఁకటిదివ్వె హెచ్చఁగా
*వలియుచు వీడివీకివడు బంభరపాళి ధనుర్గుణంబుచేఁ
గలుగదు కార్యసిద్ధి యని కంజశరాసనువీనుఁ డత్తఱిన్
విలు గొనకుండఁగా నిడియె వేళమ యూనతి కేయుఁదమ్మికిన్. ౨౭౩

సీ. సజలాంబుదంబున జతకూడి యెడయక మెఱయుచుండెడుకారుమెఱుపనంగ
హరిమణిస్తంభమునందునందము మీఱఁ బూన్చిన జెక్కినపైఁడిబొమ్మ యనఁగఁ
దనరారునహాకారతరు (వు)తోఁ బెనఁగొంచులలిమించుమాధవీలత యనంగఁ
బరమకారణమైనబ్రహ్మంబు ననువున సంగతం బగుచిత్రశక్తి యనఁగఁ
బొలిచెఁ గాళిందిసన్మేను భువనభయని
వారణాధారణాటోపవాసుదేవ
ఘనభుజాదండసంతతాక్రాంత మగుచు
మించునలయిక వోలయ నిద్రించువేళ. ౨౭౪

గీ. ఏకశయ్యావదప్రవేశైధమానమూర్తు లగుచును దంపతుల్ పొలిచి రపుడు
నేకశయ్యావదప్రవేశైధమానమూర్తు లైనయలంకారములసరణిగ. ౨౭౫

సీ. చక్రవాకీశోకచటులాంధకారంబు దొలుకకువ్వాతమంబుతోడ విచ్చె
సమరమూర్ధన్య†దిగ్రమణీయకాంతితో ఘూకోష్ణనిశ్వాసగుణము హెచ్చెఁ
బంకజామోదసంభవమతోఁ గలువలం దదభావసంభూతి గదియవచ్చెఁ
దరుగతపక్షిసంతతశబ్దములతోడఁ జోరనిశ్శబ్దత సాగియఁజొచ్చె
నఖిలలోకసదాలోకనాంజనంబు, సారథ్యప్రచారాదికారణంబు
జారసంచారదుర్గ్రహోచ్చాటమంత్ర, రాజమగుచు‡నుషర్వేళ తేజరిలఁగ.

గీ. సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర, బోధగైకొని వేగంబ పుర్వఁబోఁడి
సుప్రసాదత సుకవీంద్రసూక్తు లడర, బోధ వేగంబ చెందుట పోల్కిగాఁగ.

---

* బఱలుచు మూ-బడలుచు అనిలడపాఠసమా? † దిగ్రమణాకుగంబుతో‡నుషర్వేళ

సీ. చలిగాడ్పుచేఁ దీఁగెబలెఁ దేటనమ్మైన నలకలు జలజలంజలను రాలఁ
గొప్పి చక్కఁ గుదుర్చుకొనఁ గతి కాంతులు పొంత బంగరుజలపోఁత లీన
నిదుర చాలనియట్టి నళినలోచనంబులు తత్కాలజలజంబుఁ దప్పిగొనఁగ
మిగిలెడునసురక్తి మగుడిచూడఁగఁ జూచి మదనుండు కాలూన మనసుపడఁగ
హార్దరస ముప్పఁ గాల్యభయంబు నడుమ
నలనయానంబు పాదంబు లడుగు లిడఁగ
నంత యింత తనరాని యానయడఁగ
బెడఁగువగలాఁడి వధుకయి ల్వెడలి వచ్చె. ౨౭౯

క. అతిసూక్ష్మాంబరశోభ్యా, గతకృష్ణఘనాంగ మెఱసి కమలేక్షణ దా
నతిమందయానమున *రా, నతిభద్రతటిద్విలాస యగుచుం బొలిచెన్.

క. అనలంకృతయౌవను గొని, వనజాయతనయన యపుడు వఱలె ననంగాఁ
జనదే వస్తువ్యంగ్యం, బనలంకృత మైన మోద మచ్చుట లేదే. ౨౮౦

గీ. అతనుభూషణవిస్ఫూర్తి నందితొలుత, సుతనువు తనూమతల్లి కసాగనుప్పాతు
నతనుభూషణవిస్ఫూర్తి నందకున్న, నతనుభూషణవిస్ఫూర్తినలరె నపుడు.

గీ. సుప్రసాదత సద్వ్యక్తి సుభగ యగుచు
ఘనతరాలంకృతిస్ఫూర్తి గొనక మగువ
యుత్తమంపుఁగృతి న్నగు నొక్కవింత
యొక్కయెడ సంస్కృతిచ్యుతి నొప్పు మిగులం. ౨౮౧

సీ. సానవట్టినయట్టి జలజాతబాణుని చేతిమిన్నా హేతిఁ జెనకు దానిఁ
జారుపుంస్కోకిలాస్వాదితం బైనట్టి క్రొమ్మావినిం దప్పఁ గొనెడుదాని
సంతతరాజహంసక్రీడితం బైనకమలినికై బొమ్మగట్టుదాని
మలయానిలాక్రాంతమర్దనక్లాంత మా సుమశాఖఁ జులుకఁగాఁ జూచుదాని
దవనసుతఁ జాచి ద్వారంబు దాఁటువేళఁ, దోడినెచ్చెలికత్తెలతోడవచ్చి
బిగ్గఁ గౌఁగిటఁ జేర్చుచుఁ బ్రేమమిగుల, మేలుగాఁ బల్కె నొకవాణి నీలవేణి.

ఉ. కోరిక దీరఁగా మగనిఁ గూడి సుఖించిననిన్నుఁ జూచినన్
మేరకు మీఱుమోదమున మేను సుఖించె మనంబు చింత మా
కూఱడె నీవు సెజ్జకడనుండి కటాకట తోడులేక యీ
ద్వారము దాఁక నిట్లిటకు వచ్చితివమ్మ భయంబు దక్కుచున్. ౨౮౨

*దానవిభదని-

ఉ. అంతట నింతిరోయొత్తి నగ వాసన మూరుకొనంగ బల్కు నీ
యింతికిఁ దోసు గావలెనె యిక్కడ కక్కడనుండి రాఁగనా
వంత భయంబు లోఁగొనక యాత్మవిభుం డనుదంద నీనిశం
గంతుకురంబుఁ జేసి వలిగాయము లందిన మేటి గావునన్. ౨౮౫

ఉ. అప్పుడు నీలవేణి చెలియందపుఁ జేష్టలు చూడఁగోరి యో
యొప్పులకుప్ప నీవు మది నొవ్వగఁ జేఁ దలపూన్చెఁ బూనినే
తప్పక చెప్పు మన్న నగుఁ దాల్చుట సిగ్గున మోము వాంచుటం
జెప్పెను వాని యంతరము చిన్నెలు చెప్పఁగఁ జానరుక్తిగన్. ౨౮౬

వ. ఇట్లు కాళిందీమిళిందచికురం గరగ్రహణంబు చేసి యనంతరంబ మిత్రవిం
దాకుందరదనం బెండ్లియాడి నాగ్నజితీయానవతిం జెట్టవట్టి భద్రాభద్రే
భయానం గాలుఁద్రొక్కి మద్రరాజన్యకన్యక యైన లక్షణకుం బొట్టుగట్టి
యష్టమహిషీనయనచకోరకరద్రాకానిశాకరుండై యక్కటకటయానవన
రుండు పిదప నరకాసురుం ద్రుంచి [యింద్రలోకంబునకుం జని యదితిచేఁ
గుండలంబులు గొని పారిజాతనగంబు సంగ్రహించి నరకుం ద్రుంచి] తత్కా
రాగృహానీతషోడశసహస్రరాజకన్యకల నాత్మకరగ్రహణంబున ధన్యలం
గావించి తద్భావతనిరంతరప్రమోదాపాదనదక్షిణుం డగుచు దక్షిణుండై
ధీరలలితనాయకోత్తముం డనవెలయుచు మునులకుఁ దపఃఫలం బై యరి
నీకులకుఁ గృతాంతుం డై యర్థులకుం జింతారత్నంబై ధనుర్ధరులకు వీరా
గ్రసరుండై విద్యార్థులకుఁ బరమాచార్యుండై గాయకులకు వాగ్గేయకా
రశిరోరత్నంబై శరణాగతులకు వజ్రపంజరంబై విదగ్ధులకు (ర)సికావతంసం
బై మదవతులకు నభినవమదనుం డై సంఖ్యావంతులకు శాస్త్రవేత్త యై
నటులకు హాళీసకతల్లజుం డై కర్షకులకు ననుష్ఠాత్మప్రకాండుం డై తత్త్వవా
దులకుం బరమతత్త్వం బై యోగీంద్రులకు లక్ష్యం బై (రస)వాదులకు జగ
దేకరసంబై సుగుణవాదులకు నుపాస్యం బై భాసిల్లుచుండ నయ్యవ
సరంబున. ౨౮౭

సీ. *శాస్త్రంబు గతి ననుష్ఠాపకత్వవిలాసభాసురంబై చాల వాసిఁగాంచె
దా(హాకరో)దారదవకేలి వంధ్యాకుమారునితోఁ బొందు గోరకానిమొ

---

[ ] ఈ నడిమి వాక్యము సందర్భశుద్ధిగా లేదు *శాస్త్రంబులీల-

దారిద్ర్యఖేదసంధానంబు గగనమండలపుండరీకంబు చెలువు మీఱ
శశమృగంబు శిరంబు చక్క ద్రొక్కి మెఱుంగు కొమ్ము న(వద్ధ)ర్థ మిమ్ము చేసి
నవనినాథా! గోపాల మఖిలజనుల, నలువు మిగులంగ బ్రాపించెనవరసముల
నలప్రసాదంబు పొందెదమనుచుఁగాఁగ, నతులసౌఖ్యంబు చూపవలయుదు గనఁగ.

ఉ. మంగళ మంగజాతరిపుమంజులమానసమధ్యవర్తికిన్
మంగళ మబ్జ(జ)ప్రముఖమానితదైవతచక్రవర్తికిన్
మంగళ మానతార్తికృదమంగళభంగదసారకీర్తికిన్
మంగళ మాదిమూర్తికి ఘనప్రభమూర్తికి రామమూర్తికిన్. ౨౮౯

గద్యము.

ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందమిళిందాంతఃకరణ పోలూరి మాధవ
యజ్వసముజ్జ్వలత్కృపోక్షితకటాక్షసాదితపాండిత్యాభరణ ప్రథం
జనవంశాబ్ధిరాకాశశాంక నిరంతరారాధిత విచక్షణ శశాంక
అభినవనన్నయభట్టారకా హోబల పత్యాహ్వయ
కవిమహోపాధ్యాయభట్టారక విరచితం
బైనకాళిందీకన్యాపరిణయం బను
మహాప్రబంధంబునందు
సర్వంబును షష్ఠాశ్వాసము.

---

ద్వితీయభాగము సంపూర్ణము.

---

అఖిలభూతచయము లణఁగి మాయనుజేరె, నదియు నా కనన్య యయ్యె ననెడి
   జ్ఞప్తికుంట తానె జ్ఞానరూపుండురా, పటు. ౨౭

నలినభవసురేంద్రనరతిర్యగాదుల, సుఖములును దదీయసుప్తిసుఖము
   లంత మగుటఁ దా ననంతరూపుండురా, పటు. ౨౮

అట్లు శ్రోత్రయుక్తికానుభూతులను స, త్యాదిలక్షణాత్ముఁడై ప్రమేయుఁ
   డగుచువాస్తవమున నప్రమేయుండురా, పటు. ౨౯

అప్రమేయుఁడైన యమ్మహాపురుషుండు, కలిగి లేని దొక్క కాంత నెనసి
   పుట్టి చచ్చుజనులఁ బుట్టించె వినుమురా, పటు. ౩౦

అయ్యమేయునం దనాదిగా నొకశక్తి, గలదు మున్నె త్రిగుణకలిత యగుచు
   దానిఁ బ్రకృతియనుచుఁ దత్త్వజ్ఞు లందురా, పటు. ౩౧

మట్టివిత్తునందు మట్టిచెట్టున్నట్లు, మంటిలోన ఘటము మలయునట్లు
   ఆత్మునందుఁ బ్రకృతి యలవడి యుండెరా, పటు. ౩౨

విపులయందుఁ బెక్కువిత్తనం బున్నట్లు, విత్తనున్న పెక్కు విత్తులట్లు
   ప్రకృతియందు జీవపటలంబు లుండురా, పటు. ౩౩

ఆపురాణపురుషుఁ డాజీవపటలమై, తోఁప మాయయగుచుఁ దోఁచెఁ బ్రకృతి
   అమలరూప యెద్ది యదియుపో మాయరా, పటు. ౩౪

ఇదియు నదియు నట్టి దిట్టి దింతింతని, యెఱుఁగరాక నదియు నిదియు నిట్టి
   దట్టి దంత యింత యనడిదే మాయరా, పటు. ౩౫

కారణమునఁ దోఁచు కార్య మాకారణ, మణఁచినట్టు లాత్మయందుఁ దోఁచి
   యాత్మ నణఁచు నెద్ది యదియె పో మాయరా, పటు. ౩౬

స్థాణువుననరుండు త్రాట భుజంగంబు, దొరసి మింట నలుపు దోఁచినట్టు
   లాత్మ నెద్ది తోఁచు నదియుపో మాయరా, పటు. ౩౭

యువతిగర్భమందు నుంచిన రేతంబు, అవయవాస్వితాంగ మైనయట్టు
   లఖిలజగము లెద్ది యగు నదే మాయరా, పటు. ౩౮

పృథివిలోనఁ గలయుబీజంబు లెల్లను, వృక్షలతిక లగుచు వెలసినట్టు
   లఖిలజీవు లెద్ది యగు నదే మాయరా, పటు. ౩౯

తన్నుఁగననివానిఁ దన్నుగాఁ గావించి, తన్నెఱుంగువానిఁ దప్పఁ జేసి
   యాశ్రయించు నెద్ది యదియుపో మాయరా, పటు. ౪౦

ఆత్మ నుండకున్న నాత్మ నెర్గకయున్న, నాత్మ నలరకున్న సజ్జనుల
   నావరించు నెద్ది యదియుపో మాయరా, పటు. ౪౧

తాను గలిగియున్నఁ దా నెఱుంగుచునున్నఁ, దాను మఱియుచున్నఁ దద్జ్ఞజనుల
నాక్రమించ దెద్ది యదియపో మాయరా, పటు. ౪౨

తనదుకలిమి లేనితనువునఁ దన తెల్వి, గాని మదిని దనసుఖంబు పోని
యాలిఁ జేర్చునద్ది యదియపో మాయరా, పటు. ౪౩

కల దనంగఁ దన్నుఁ గనఁబోవు లేదనఁ, గలదు సజ్జ్ఞదృష్టిఁ గలిగి లేని
దనఁగ రాదు దేని నదియపో మాయరా, పటు. ౪౪

ఆత్మదృష్టి నసృత మగు నవాచ్యము యుక్తి, దృష్టినగుచు లౌక్యదృష్టిచే న
నంత మయ్యె నెద్ది యదియపో మాయరా, పటు ౪౫

మాయకాత్మవశత మహదహంకారత, న్మాత్రభూతభువనగాత్రవితతు
లగుచుఁ దనకుఁ దనువు లై యుండె వినుమురా, పటు. ౪౬

మాయ యనెడి దొక్క మాఁని యది పరి, శుద్ధురాలు నపరిశుద్ధురాల
సంగ మించి యిరువిధాంగనలైరిరా, పటు. ౪౭

ఆపరాత్ముఁ డందు నాశుద్ధశక్తిని, నాశ్రయించి యీశుఁ డయ్యె నతఁడె
మలినశక్తి నెనసి మఱి జీవుఁ డయ్యెరా, పటు. ౪౮

ఘనత సుప్తిహేతుగతి నీశ్వరుఁడు స్వప్న, సూక్ష్మదేహగతిని సూత్రి జాగ్ర
దన్నగతి విరాజుఁ డై యీశుఁ డుండెరా, పటు. ౪౯

వ్యష్టి సుప్తి బీజదృష్టిఁ బ్రాజ్ఞుఁడు స్వప్న, సూక్ష్మదృష్టిఁ దైజసుండు జాగ
రాన్నదృష్టి విశ్వుఁ డై జీవుఁ డుండెరా, పటు. ౫౦

శుద్ధురాలు తన్నుఁ జూచి క్రీడించిన, వాని నీశు నింకఁ దాను మూఁడు
దెర్లఁ బఱుచు మూఁడు తివ్వలఁ బెట్టురా, పటు. ౫౧

రజము మదిఁ బెనంగ రాజసాంగన తన్ను, వలచియున్న బొమ్మ వాయిగట్టి
భువి సళించు జనులఁ బుట్టింపఁ జేసెరా, పటు. ౫౨

సత్త్వ మెదఁ బెనంగ సాత్త్వికాంగన తన్ను, నమ్మియున్న చక్రి బొమ్మ ద్రాక్కి
పుసమిఁ బొడను జనులఁ బోషింపఁ జేసెరా, పటు. ౫౩

కేవలాత్ముఁ డిట్లు జీవేశు లఃశక్తి, భేదకల్పనమున భిన్నుఁ డయ్యె
వాస్తవమున నాత్మవస్తువే యొకటిరా, పటు. ౫౪

తమము మతిని గతుకఁ దామసాంగన తన్ను, నొరయు హరుని సగము నొడలు చేసి
ధరణి మునియు జనుల దండింపఁ జేసెరా, పటు. ౫౫

ఉభయదేశకాలయుతమర్త్యు నొకనిఁగాం, చుండఁజూచుపగిది నుభయవాచ్య
లక్షణములఁ ద్రోయ లక్ష్యార్థ మొకటిరా, పటు. ౫౬

ఘటశరావములను ఘటమతంబులఁద్రోచి, మన్ను మిన్ను నొక్కటన్నపగిది
జీవభావరహితజీవేశు లొకటిరా, పటు. ౫౭

వాస్తవములు గాని వాచ్యార్థములు రెంటి, మఱచి చూడలక్ష్యమయములగుచుఁ
బరఁగు ప్రత్యగాత్మపరమాత్మ లొకటిరా, పటు. ౫౮

ఘనఘటోదకములఁ గడవఁ దశ్చలరహా, తార్థ మొక్కటైనయట్లు నుభయ
దేహాధీఫలవ్యతీతాత్మ లొకటిరా, పటు. ౫౯

తనువు గానితాను త్వంపదార్థము విశ్వ, తతులు గాని తాను తత్పదార్థ
మసిపదార్థ మావగాత్మైక్య మగునురా, పటు. ౬౦

మింటనలుపు దోఁచి మిను గన నలుపులే, నట్లు తాను జీవుఁడగుచుఁ దన్నుఁ
దెలియ జీవగతులు దొలఁగి తా నయ్యెరా, పటు. ౬౧

ఇట్లు సాత్మరూప మేను గా ననిత్రోసి, వెలసి తన్నుఁదెలియ వెరవు నీకు
విస్తరించి తెలియ వినిపింతు వినుమురా, పటు. ౬౨

ఆలు మగఁడుఁ దిన్నయన్నంబువలనను, సురతజనితరక్తశుక్లములును
గూడి మొదల నన్నకోశమై యుండురా, పటు. ౬౩

అన్నమయములోన నైదుప్రాణంబులుఁ, గరపదాదికర్మకరణములును
మమతఁ గూడి ప్రాణమయకోశ ముండురా, పటు. ౬౪

ప్రాణమయములోనఁ బ్రబలమై శ్రోత్రాది, జ్ఞానకరణచిత్తమానసముల
మలయుచున్నహృదయమయకోశ ముండురా, పటు. ౬౫

అమ్మనోమయాంతరమ్మున శ్రవణనే, త్రాదికరణబుద్ధ్యహంకృతులును
మహితమైన బుద్ధిమయకోశ ముండురా, పటు. ౬౬

మఱియు నాప్రబుద్ధిమయకోశమునఁ బ్రియా, ద్యఖిలవృత్తిసహితమై తమోమ
యాత్మకమున నుండు నానందమయమురా, పటు. ౬౭

ఆప్రియాదిసంయుతానందమయములో, నాత్మఁ డుండు వాని నరయ కాత్మ
కోశమయుఁ డటంచుఁ గొలుతు రెట్లన విను, పటు. ౬౮

పుట్టిపెరుఁగుచుండు బొంది తా నని కొంద, ఱందు రదియుఁ దెలియ కనుటగాక
తాను వెడలఁ గాల్చుతను వెట్టు లాత్మరా, పటు. ౬౯

బ్రదికి కుడువ మొదలు ప్రాణ మాత్మని కొంద, అందు రదియు నెఱుఁగకనటగాక

పట్టు వదలఁ బోవు ప్రాణ మె ట్లాత్మ గా, పటు. ౨౦

చేటుపాటుఁ దెలుపు చిత్త మాత్మని కొంద, అందు రదియుఁ గాన కనట గాక

చెప్పినట్లు వినని చిత్త మె ట్లాత్మరా, పటు. ౨౧

నేను నాయి దనుమనీష యాత్మని కొంద, అందు రదియుఁ జూడ కనట గాక

నిద్ర నణఁగఁగల మనీష మె ట్లాత్మరా, పటు ౨౨

సుప్తినెలవుగలుగు శూన్య మాత్మని కొంద, అందు రదియు నరయ కనటగాక

చూడ లేని సర్వశూన్య మె ట్లాత్మ గా, పటు. ౨౩

సుప్తి నందఁ బడెడు సుఖ మాత్మ యని కొంద, అందు రదియు నేర కనటగాక

తెఱుఁగరాని సౌఖ్య మె ట్లాత్మ యగునురా, పటు ౨౪

అణువు మధ్యమము మహాత్ముఁ డాత్మని కొంద, అందు రదియుఁ జెద కనటగాక

ఆత్మ నిర్వికారుఁ డదియుఁ దా నెట్లుగా, పటు. ౨౫

చిన్మయుండు మఱియుఁ జిన్మయుండును జీవ, చిన్మయుం డటంచుఁ జెప్పి కొంద

అందు రళుఁ డాత్ముఁ డదియుఁ దా నెట్లురా, పటు. ౨౬

పంచకోశములకుఁ బయిన కిట్లనోన్యన్య మేకవృత్తి యగుట నేర్పఱచి

లోన నున్న తను విలోకింపవలయురా, పటు. ౨౭

గృహగృహాంతరార్థకృత్యాద్యతీతుని, కరణి దేహదేహకలితమూరు

తాత్మనతితమోమయాతీతుఁ డాత్మ గా, పటు. ౨౮

గృహములోనివాఁడు గృహము తాఁ గానట్లు, తనువులోనివాఁడు తనువుగాక

తనువు నెఱుఁగుచుండు తా నని తెఱుఁగరా, పటు. ౨౯

కన్నులోనివాఁడు కన్ను తాఁ గానట్లు, గాలిలోనివాఁడు గాలిగాక

గాలి నెఱుఁగుచుండు ఘనుఁ డని తెలియరా, పటు. ౩౦

రథములోనివాఁడు రథము తాఁ గానట్లు, మనములోనివాఁడు మనము గాక

మనము నెఱుఁగు బోధమయుఁ డని తెలియరా, పటు. ౩౧

శయ్యలోనివాఁడు శయ్య తాఁ గానట్లు, ప్రజ్ఞలోనివాఁడు ప్రజ్ఞగాక

ప్రజ్ఞ నెఱుఁగుచుండు ప్రాజ్ఞుండె తానురా, పటు. ౩౨

కోటలోనివాఁడు కోట తాఁ గానట్లు, ప్రకృతిలోనివాఁడు ప్రకృతిగాక

ప్రకృతి నెఱుఁగుచుండు ప్రభుఁ డని తెఱుఁగరా, పటు. ౩౩

నాఘటంబు సాధనం బనువాఁ డని, యేమి గాని పగిది నాసనంబు
నాశరీర మనెడుఁ దాశేషభూతుండు, పటు. ౮౪

తనువు గాఁడు మారుతము గాఁడు కరణము, ల్గాఁడు హృదయమతులుఁ గాఁడు కాఁడు
కాఁడని యెడు వానిఁ గనువాఁడె తానురా, పటు ౮౫

తెలుపు నలుపుఁ బసుపు గలుపాపఁ బసరును, కొద్ది గొప్ప పొడవు కుఱుచ వాఁడు
గాఁడు వాని నెపుడుఁ గాంచెడివాఁడురా, పటు. ౮౬

వినెడువాఁడు స్పర్శ గొనువాఁడు రూపంబు, గనెడువాఁడు రుచులఁ గొనెడువాఁడు
తావి గొనెడువాఁడుఁ దా నని యెఱుఁగరా, పటుగు. ౮౭

పలుకులాడువాఁడుఁ బనులు చేసెడువాఁడు, నడచువాఁడు మలము విడచువాఁడు
తగ సుఖించువాఁడుఁ దా నని యెఱుఁగరా, పటు ౮౮

ఛిద్రఘటములోని వసించెడి దీపంబు, వెలిని గోడ వెల్గఁ దెలుపునట్లు
తనువులోననున్న తా నన్ని తెలియురా, పటు. ౮౯

తమ్ము నెఱుఁగ లేని తనుకరణాదులు, నాత్మ నెఱుఁగ నేర వటుట నిజము
వానిఁ దా నెఱుంగువాఁ డని తెలియురా, పటు ౯౦

కమలమిత్రుఛాయ గనిపెట్టి తమతమ, పనుల మొదలు నరులకగిదిఁ దన్ను
నాశ్రయించి హృదయచక్షువు ల్తెలఁగురా, పటు ౯౧

చుంబకంబునంటి సూదులాడినయట్లు, దారముకొలిచి భటులు దిరిగినట్లు
ఆత్మ నంటి యింద్రియంబులు దిరుగురా, పటు ౯౨

తప్తలోహమందు దహనుండు నున్నట్లు, లోపలిలోన జీవుఁ డుండి మెలఁగు
జీవునందు నిండి చిన్మయుం డుండురా, పటు. ౯౩

* యండమావు లుదకమైనట్లు తాజీవుఁ, డయ్యె నెండమావు లరయ జలము
గాని యట్లు తన్నుఁ గన జీవుఁ డేఁడిరా, పటు. ౯౪

ఘృతము గలిగియుంట క్షీరంబులును దీపి, గుడము కలిమిఁ జెఱకుగడలు తీపి
† తాఁ గలింగియుంటఁ దనువు భోగ్యంబురా, పటు ౯౫

కలశవికృతు లెల్లఁ గలశప్రకాశార్థుఁ, జేరనట్లు తనువికారములును
దనువులోననున్నత న్నంటకుండురా, పటు. ౯౬

శ్రుతులు లేక రవము శ్రుతము నొందెడువాఁడు, దనువు లేక స్పర్శ గొనెడువాఁడు
గనులు లేక రూపు గనువాఁడు తానురా, పటు. ౯౭

---

* యండమావులని యకారాదిగా వాడినాఁడు. † కలింగియని బిందుయుతముగా వాడెను.

రసనలేక రుచులు మెసఁగుచుండెడువాఁడు, నాసలేక తావి *మేసువాఁడు
మనములేక తలఁపు గొనువాఁడె తానురా, పటు. ౯౮

వినిన వినుము గనినఁ గను సోఁక సోఁకు మూ,ర్కొనిన మూరుకొనుము ననుభవింప
ననుభవించు నెవ్వఁ డతఁడె తా నయ్యెరా, పటు. ౯౯

పలుకఁ బలుకు మెలఁగ మెలఁగుఁ దొలంగినఁ, దొలఁగు నడువ నడుచు దలఁప దలఁచు
నరయ నరయు నెవ్వఁ డతఁడె తా నయ్యెరా, పటుగుణాభిరామ పరశురామ ౧౦౦

ఉండఁ జోటు లేక నునికియు భోగ్యవ, స్తువులు లేక తృప్తి సుదతిపొందు
గాక సుఖము దేనఁ గల దదే తానురా, పటుగుణాభిరామ పరశురామ ౧౦౧

కానరానివానిఁ గాంచెడివాఁడును, బలుకరానివానిఁ బలుకువాఁడుఁ
దలఁపరానివాఁడుఁ దానని తెలియురా, పటు. ౧౦౨

తెలియరానివానిఁ దెలిసెడివాఁడను, మఱవరానివాని మఱచువాఁడ
నెఱుఁగరానివాఁడ నేనని తెలియరా, పటు. ౧౦౩

వీనులను గలింగి వినియెడివానిని, వీనులను దొలంగి వినని వాని
నొకనిఁగా నెఱుంగు యోగంబె తానురా, పటు. ౧౦౪

తనువు నెనసి స్పర్శ గొనియెడివానిని, దనువు లేక ముట్టుకొనని వాని
నొకనిఁగా నెఱుంగు యుక్తియె తానురా, పటు. ౧౦౫

కనులఁ గూడి రూపుఁ గనుఁగొనువానిని, గనులు లేక యేమి గనని వాని
నొకనిఁగా నెఱుఁగు నూహయే తానురా, పటు. ౧౦౬

రసన నెనసి రుచుల మెసఁగెడివానిని, రసన లేక మెసఁగరాని వాని
నొకనిఁగా నెఱుంగు యుక్తంబె తానురా, పటు. ౧౦౭

నాస నలరి తావి వాసించువానిని, నాసలేక వాసనానివారి
నొకనిఁగా నెఱుంగు నుచితంబె తానురా, పటు. ౧౦౮

శ్రోతయగుచు ధ్వనుల శ్రుతము నొందినయట్లు, వినఁగఁ బోవఁ దాను వినఁగఁబడక
శ్రోతృభావరహితసూత్రంబె తానురా, పటు. ౧౦౯

స్ప్రష్టయగుచు స్పర్శ సంస్పృశించిన భంగి, సోఁకఁ బోవఁ దాను సోఁకఁబడక
స్ప్రష్టృభావరహితసారంబె తానురా, పటు. ౧౧౦

భోక్తయగుచు రుచులు భుజియించు రీతిని, మెసఁగఁ బోవఁ దాను మెసఁగఁబడక
భోక్తృభావరహితభోగంబె తానురా, పటు. ౧౧౧

*మేయునను మేసు.

ద్రష్టయగుచుఁ గళల దర్శించుకైవడిఁ, జూడఁబోవఁ దాను జూడఁబడక
ద్రష్టృభావరహితతత్త్వంబె తానురా, పటు. ౧౧౨

ఘ్రాతయగుచుఁ దావి గ్రహియించువగిది మఱి, ఘ్రాణినతాను మూరుకొనఁగఁబడక
ఘ్రాతృభావరహితగమ్యంబె తానురా, పటు. ౧౧౩

మంతయగుచుఁ దలఁపు మననంబుగొనుభాతిఁ, దలఁపఁబోవఁ దాను దలఁపఁబడక
మంతృభావరహితమననంబె తానురా, పటు. ౧౧౪

జ్ఞాతయగుచుఁ దెలివి జ్ఞప్తిగైకొన్నట్లు, తెలియఁబోవఁ దాను దెలియఁబడక
జ్ఞాతృభావరహితజ్ఞానంబె తానురా, పటు ౧౧౫

దృశ్యమర్థములును దృక్కులక్షుములవి, దృశ్యమైనమనము దృక్కుమనము
దృశ్యమైననాత్మదృక్కది తానురా, పటు. ౧౧౬

తెలియఁబడెడిదెల్ల దృశ్యంబు దానిని, దెలియుచుండువాఁడు దృక్కు వాని
దెలియుదృక్కుమీఁదఁ దెలియంగలేదురా, పటు. ౧౧౭

తన్నుఁ దెలియ దృక్కు లిదనాత్మయననది, తెలియ బనుచుఁ దన్నుఁ దెలియునెట్లు
దీపభాస్యఘటము దీపంబు నెఱుఁగునా, పటు. ౧౧౮

తన్నుఁ దెలియుదృక్కు తనకునుదక్కునై, తెలియ ననిన నదియుఁ దెలియునెట్లు
స్వల్పదీప మెఱిఁగి సవితృని దెల్పునా, పటు. ౧౧౯

తన్నుఁ దెలియు దృక్కు తనకు సమానమై, తెలియుననినశ్రుతులఁ గలుగ దదియు
దీప మాత్మసదృశదీపంబు నెఱుఁగునా, పటు. ౧౨౦

తన్నుఁ గాంచుదృక్కు తనకెక్కువై తను, గాంచుననిన దానిఁ గాంచు నొకటి
యనుచుఁ బెక్కు లగుట ననవస్థ వచ్చురా, పటు. ౧౨౧

కాన దృక్పరంపరానువృత్తులనెల్లఁ, దొలఁగఁద్రోసి వానిఁ దెలియు మొదలి
దృక్కు నే నటంచుఁ దెలియంగ వలయురా, పటు. ౧౨౨

ప్రకృతిభూతములును బ్రాణంబులును నింద్రియములు మనము బుద్ధ్యహంకృతులును
నాఁగ నిరువదియును నాలుగుక్షరములు, పటు. ౧౨౩

తుదిక్షరుండు తచ్చతుర్వింశకుండు క్షు, రుండు పంచవింశకుండు తత్ప
రాత్ముఁ డక్షరాక్షరవిలక్షణుండురా, పటు. ౧౨౪

సత్య మక్షరం బసత్యంబు క్షరమును, జిత్తు నక్షరం బచిత్తు క్షరము
సౌఖ్య మక్షరం బసౌఖ్యంబు క్షరమురా, పటు. ౧౨౫

ఆయసంజ్ఞఁ దాసుఖాత్మకత్వరము దా, గాక సత్యచిత్సుఖాత్మకాత్మ
రాత్మయుండ నేన యని కనవలయురా, పటు. ౧౨౬

అనిమేషమాది యుగలయాంతంబు గాఁ, గలుగు భూతభావికాల మరుగ
నరుగకుంటఁ దానె యగుసన్మయుండురా, పటు. ౧౨౭

కాయమనిలములును గరణంబులును మనో, మతు లవిద్య పెక్కుమసిపోవ
సమయకుంటఁ దానె సద్రూపకుండురా, పటు. ౧౨౮

ఇవి ఘటాదు లివి హ్యాది క్రియాదులివి, వృత్తు లనుచు నెఱిఁగి వెలిని లోనఁ
జెలఁగుచుంటఁ దానె చిద్రూపకుండురా, పటు. ౧౨౯

తెలియఁజేయ నక్ష్యధీచక్షువులు లేక, వెలుఁగఁజేయ నొంచు వెలుఁగు లేక
చెలఁగి వెలుఁగు తానె చిద్రూపకుండురా, పటు. ౧౩౦

సుఖముగలుగఁజేయు సుమగంధములు లేక, శయ్యనొరగి కూడ సతులు లేక
సుఖము గొనుట తానె సుఖరూపకుండురా, పటు. ౧౩౧

ఆలుబిడ్డ లర్థమాదిగాఁగల వెల్లఁ, బ్రియము లగుచుఁ దనదు ప్రియమువలనఁ
జూడఁబడుటఁ దానె సుఖరూపకుండురా, పటు. ౧౩౨

కంజభవుఁడు మొదలుగా స్తంబపర్యంత, మగుచరాచరములయందు నింగిఁ
బోలి నిండియుంటఁ బూర్ణుండు తానురా, పటు. ౧౩౩

అట్టి పూర్ణసచ్చిదానందమయుఁడ నే, నని యెఱుంగు పారమార్థికుండు
అమృతపదవి నొంద సమనస్కుఁ డయ్యెరా, పటు. ౧౩౪

విషయములఁ గదల్చి వివిధాత్మముల మల్చి, మనముతోడఁ గల్పి మదిమరల్చి
యాత్మ నిల్పి తానె యమనస్కుఁ డగునురా, పటు. ౧౩౫

మనమె దేహకరణమహదహంకృతులును, మనమె రాగరోషమత్సరములు
మనమె విషయములును మనమె కర్మములురా, పటు. ౧౩౬

మనమె జాగరంబు మనమె స్వప్నంబును, మనమె సుప్తియును సమాధి మనమె
మనమె మీరు మేము మన మనుతలఁపురా, పటు. ౧౩౭

మనమె జీవకృతసమస్త సంసారంబు, మనమె యీశకృతసమస్తజగము
మనమె యుభయకృతసమస్తధర్మములురా, పటు. ౧౩౮

ఇంతయేల మనమె యీశులు జీవులు, భువనభవనభాగ్యభోగ్యములును
పటఘటాదు లన్నపానముల్మనమురా, పటు. ౧౩౯

మనము గలియఁ గరణమండల మనిలసం, పత్తి విషయములకుఁ బరువువెట్టు
మనము గలియకున్న మతి సుప్తి నణఁగురా, పటు. ౧౪౦

మనమనంగ నల్పమయ మది సంకల్ప, మదియు లేదు హరిపదాబ్జ మట్లు
అట్టి మనము లేమి యమనస్క మగునురా, పటు. ౧౪౧

లేనిమనముచెలిమి తా నభిమానించి, వేఱె తలఁపుగొనుట వెఱ్ఱితనము
శుక్తిఁ దోఁచు వెండి సామ్యము నిలుచునా, పటు. ౧౪౨

ఉన్నరీతిఁ దన్నుఁ నుండఁగాఁజూచిన, లేనిమనముతోన లేకపోవుఁ
ద్రాడునెఱుఁగఁ బాము తథ్యమై నిలుచునా, పటు. ౧౪౩

తెలివియైనతన్నుఁ దెలివిగాఁ దెలిసినఁ, దెలివిగానిమనము తొలఁగిపోవుఁ
దపనుఁ డుదయమొందఁ దమము చూపట్టునా, పటు. ౧౪౪

సుఖమయైనతన్ను సుఖముగా నెఱిఁగిన, దుఃఖరూపమనము దోఁపకుండుఁ
దొడరి సుప్తియందు దుఃఖంబు గల్గునా, పటు. ౧౪౫

హరిపదాబ్జమునకు హరిపదంబునకును, దగుల మెన్నఁడేని దగనియట్లు
తనకు మనమునకును దాదాత్మ్యమున్నదా, పటు. ౧౪౬

కొఱడు నెఱుఁగనరుఁడు గుఱిపడకున్నట్లు, నింగినెఱుఁగ నలుపు నిలువనట్లు
తన్నెఱుంగ మనము సున్నగాకుండునా, పటు. ౧౪౭

ఎన్నలేనిమనము నున్నదన్నది సున్న, కన్నదెల్లఁగల్ల యెన్నఁడున్న
తన్ను విన్నఁ గన్న మన్న మేలెన్నరా, పటు. ౧౪౮

లేనిమనము నెపుడు లేకుండఁగనుదన్నుఁ, దానవికృతులెట్లు తగిలివచ్చుఁ
గలను గన్నపాము గఱవ నేమయ్యెరా, పటు. ౧౪౯

సుమరసంబుగ్రోలి సొక్కెడుభృంగంబు, చంపకంబు సోఁకనమయుభంగిఁ
దన్నుఁ గనిన మనము తనయందె నమయురా, పటు. ౧౫౦

పాలలోనఁ గలయు *పందార కైవడి, నుదకమందుఁ గలియు నుప్పురీతిఁ
దన్నుఁగనినమనము తా నయిపోవురా, పటు. ౧౫౧

ఇంధనములు లేనియింగలంబును తను, దా కృశించుకరణిఁ దన్నుఁ గన్న
వానిమనము తనకుఁ దాన కృశించురా, పటు. ౧౫౨

శిఖిని జూచి యణఁగు చిలువలకైవడి, హరిని జూచి మ్రగ్గుకరులయట్లు
లాత్మఁగని హృదింద్రియము లూరకుండురా, పటు. ౧౫౩

స్వానుభవవిచారసంపత్తి లేకున్న, మనసు మ్రగ్గ దదియు మ్రగ్గకున్న
స్వానుభవవిచారసంపత్తిలేమరా, పటు. ౧౫౪

---

* పంచదారయనుటకు "పందార"

పెక్కు సెప్పనేల ఫేనంబు జలము భూ, షణము స్వర్ణమైనసరణి మాన
సంబు తత్స్వతంబు స్వస్వరూపమ్మురా, పటుకరా. ౧౬౮

నీట వానచినుకు పాటున బుగ్గయై, నిలిచి నిజమనట్లు నిజముగానఁ
గలియుఁ దనకు మనము గలిసి లేకుండురా, పటు. (పాఠాంతరము)

అట్లు స్వస్వరూప మంది మనోలయ, మైనభవ్యుఁడే సదాసమస్త
పదవిగల సమాధిపరుఁ డని తెలియురా. పటు. ౧౬౯

వింటి వినను గనను గంటిఁ బల్కితిఁ బల్కి, నను పవనముకు నగజీవనములను
దెలియుచుంట బాహ్యదృశ్యసమాధిరా, పటు. ౧౭౦

అజుఁడ నవ్యయుఁడ ననాద్యంతుఁడ నఘుండఁ, ననిపయుండ నమల ననెడువృత్తి
సమితిఁ గనుట బాహ్యశబ్దసమాధిరా, పటు ౧౭౧

తలఁచితివి దలంపఁ దెలిసితిఁ దెలిపు నెఱుంగ నెఱుఁగు దని కలుగుమతులఁ
దెలియుచుంట లోనిదృశ్యసమాధిరా, పటు. ౧౭౨

ఆయసంజ్ఞఁ దా సుఖాతీతసచ్చిత్సు, ఖములఁ దెలిసి వానిఁ గాంచు తెలివి
సడలకుంట లోనిశబ్దసమాధిరా, పటు. ౧౭౩

సడలి బాహ్యదృశ్యశబ్దవృత్తుల నెల్లఁ, దొలఁగఁ ద్రోచి వానిఁ దెలియు తెలివి
నిలిచియుంట బాహ్యనిర్వికల్పంబురా, పటు. ౧౭౪

ఆయఖండవృత్తి నాంతరదృశ్యశ, బ్దానువృత్తు లణఁచి వానిఁ గాంచు
నిజము గనుట లోని నిర్వికల్పంబురా, పటు. ౧౭౫

తాను సర్వమునను దనయందు సర్వంబు, నరసి సర్వరూపుఁడై నెఱుంగు
జ్ఞప్తి గలిగియుంట జ్ఞాతసమాధిరా, పటు. ౧౭౬

బ్రహ్మవిదుఁడ ననెడిభావన గలుగక, బ్రహ్మమైతిననెడి భావ ముడుగఁ
దానె యుంట జ్ఞప్తిలేనిసమాధిరా, పటు. ౧౭౭

ఈసమాధు లెఱిఁగి యిందెద్దినొందినను, బాలుభంగి సుప్తుగతిని దన్నుఁ
దా నెఱుంగుచున్న ధన్యుండె ఘనుఁడురా, పటు ౧౭౮

అతఁడె బ్రహ్మవిష్ణుఁ డతఁడె జీవన్ముక్తుఁ, డతఁడె సాంబశివుఁడు నతఁడె విష్ణుఁ
డతఁడె గురుఁడు ధన్యుఁ డతఁడని యెఱుఁగురా, పటు ౧౭౯

ఎఱుకవానితోటి మెఱిఁగినకనుసూటి, నెలకనులు మీటి ఖిల్లుదాఁటి
చావులేనిచోటి సదివుండు భోగిరా, పటు ౧౮౦

తెలివివానిఁ జేరి తెలిసిన తనదారి, నింటివారి దాఁటి హితవు గోరి
మఱపుదాని మీఱి మను మహాత్ముండురా, పటు. ౧౮౧

అంటరానిదాని నంటి తోడగువాని, నంటమాని లోనికంటఁ బూని
యొంటిగానిఁ గూడి యుండు ధీరుండురా, పటు. ౧౮౨

దేహమమతలార్చి దేహాహంతయుఁదీర్చి, సోహమాత్మఁగూర్చి చూడనేర్చి
యూహలేనిపదవి నుండుముక్తుండురా, పటు. ౧౮౩

బ్రహ్మమును బఠించి బ్రహ్మమ్ము నెఱింగి, బ్రహ్మ మాచరించి బ్రహ్మ మెఱిఁగి
బ్రహ్మమైనవాఁడు బ్రాహ్మణోత్తముఁడురా, పటు. ౧౮౪

నీరిలోననుండి నీరంబునంటని, తామరాకుపగిదిఁ దత్త్వవిదుఁడు
సంచరించుకొనుచు సంగి గాకుండురా, పటు. ౧౮౫

అప్పు లిచ్చువాని కప్పులిచ్చినవొప్పు, నుప్పరంబు కరణి నున్నవానిఁ
గన్నవాఁడు నిర్వికారుఁడై యుండురా, పటు. ౧౮౬

ప్రత్యగాత్మరూపభావనాపరున కేర్పడకయుండు జీవభావమింత
వేషధారి నెఱుఁగ వేషంబు నిలుచునా, పటు. ౧౮౭

అఖిలమాత్మఁ డాత్మఁ డఖిలం బనియెఱుంగు, ఘనున కితర మేమి గానఁబడదు
దారువని యెఱుఁగఁ జోరుండు దోఁచునా, పటు. ౧౮౮

తాళగానగతులు దప్పక తలదొంతి, బూనఁజూచునటుని బోలి బుధుఁడు
ఎల్లపనులు గొనుచు నెఱుకతోనుండురా, పటు. ౧౮౯

పరసతీరతుండు బహులార్థియై దాని, పొందు గోరినట్లు బుధజనుండు
సకలవిధులుగొనుచు సాక్షినే చూచురా, పటు. ౧౯౦

స్వకృతచిత్రపుర మసన్మయం బని కాంచి, మాయికుండు నిలఁగుమాడ్కిఁదదజ్ఞుఁ
డాత్మకృత్య మనృత మని చూచి నడచురా, పటు. ౧౯౧

మంటనుండి మంటినంటనికుమ్మర, పురువుభంగిఁ దత్త్వపూర్ణుఁ డఖిల
గుణసమేతుఁడయ్యు గుణరహితుండురా, పటు. ౧౯౨

బ్రహ్మభావనుఁడు ప్రపంచంబు గొనుచుఁద, ప్పించుకొనితొలంగుఁ బెరుఁగుదరువ
నడలివచ్చువెన్న చల్లలోఁ గలియునా, పటు. ౧౯౩

నిఖిలమనుభవించి నిష్కల్మషుండైన, యనలునట్లు తదజ్ఞుఁ డఖిలవిషయ
కాముఁడయ్యు విగతకాముఁడై యుండురా, పటు. ౧౯౪

మోదఖేదవిషయమోహంబువర్జించి, శత్రుమిత్రులందు సమతగలిగి
సర్వపూర్ణుఁడైన జనుఁడు విజ్ఞానిరా, పటు. ౧౯౫

మేలు గలిగెనేని జాలిఁగా మురియక, కీడు గలిగెనేని గినుకపడక
సమత నుండువాఁడె సత్పురుషుఁడురా, పటు. ౧౯౬

సఖులు సంస్తుతింప సంతోషమందక, పరులు నిందచేయ బాధపడక
ఆత్మరతుఁడెపో మహానుభావుండురా, పటు. ౧౯౭

గురుకటాక్షదృష్టి గ్రోక్కి దీక్షను గ్రోక్కి, దీక్ష నేని మనసు దీక్ష మనసు
దీక్ష నేని తనువు దీక్షఁ దా మీఱురా, పటు. ౧౯౮

నిఖిలవిషయములను నిఖిలేంద్రియములచే, నెఱుఁగు నెఱుక నెపుడు నేనయనెడి
చిన్మయాత్మరతుఁడు జీవన్ముక్తుండు, పటు ౧౯౯

వెలయ మొదటితనువు విడిచినబోధజీ, వన్ముక్తి నడిమివపువు విడువఁ
గడశరీర ముడుగ గతదేహముక్తిరా, పటు. ౨౦౦

నిప్పు నీఁగలంటు నింగిని జెదలంటు, ననుట లేఁయట్లు నాత్మవిదుని
సుకృతదుష్కృతములు సుడియకయుండురా, పటు ౨౦౧

జ్ఞానవహ్నిఁ గాలు సంచితంబెల్ల నకర్త యగుట భావికర్మ ముడుగు
బ్రహ్మమైనయపుడె ప్రారబ్ధ ముడుగురా, పటు. ౨౦౨

ఆత్మదృష్టిలేని యారబ్ధ మన్యదృ, ష్టిని గలుఁగ నేమి సేయఁగలదు
అన్యదృష్టిఁ దోఁచు నహి త్రాడు మ్రాఁగునా, పటు. ౨౦౩

గురునిపదముఁబట్టి గురుకటాక్షమువట్టి, గురుపదమ్మునుట్టి గుఱుతువట్టి
గురుని గోనఁగలియు గురుఁడె కేవలుఁడురా, పటుగుణాభిరామ పరశురామ.

ఈద్విపద్యశతము నెవ్వఁడేనియు విను, వ్రాయఁ జదువఁ జెప్ప వాఁడు తాను
బ్రహ్మమగుచుఁ బరమపదమునం దుండురా, పటుగుణాభిరామ పరశురామ.

భూమినోదవి పరశురామపంతులరామ, మూర్తి బ్రహ్మతత్త్వమూర్తులకును
వెలియ రెండుశతకములఁ దేటపఱిచెరా, పటుగుణాభిరామ పరశురామ.

# కన్నశతకము.

## కందపద్యములు.

అబ్బురపు బాలపదముల, జొబ్బిల్లెడి రసముఁ గ్రోలఁ జోకవహింపన్
నిబ్బరపుఁ గవిత లబ్బుట, యబ్బురమా యెఱుకగన్న *యెఱుఁగుడికన్నా. ౧

ఎబ్బెట్టుమతము రోయుచు, నిబ్బరముగ బాలపాదనీరజరసమున్
ఉబ్బుచుఁ గ్రోలినయంతట, నబ్బంగిని గవితలన్న యెఱుఁగుడికన్నా. ౨

అంజనపుత్త్రుని కృపచే, రంజిల్లుచు శారదాంబ రసికత మెఱయన్
మంజుల వాక్యము లిచ్చెను, రంజిత బాలాప్రసన్న రవికులకన్నా. ౩

మాందర విజయుని కృపగని, యందుపయిన్ యోగివరుని యనువునఁ (గను)విం
పొందఁగ బుచ్చనగురుదయ, నిందిర నీకబ్బురన్న యెఱుఁగుడికన్నా. ౪

పిల్లలమఱి బుచ్చనగురు, చల్లనివాగమృతఘుటన సమరస మొక్కం
గల్ల ప్రపంచము రోసియు, నెల్లప్పుడు నెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౫

బుచ్చనగురుపదవనజము, లచ్చుగ నాహృదయమందు నమరినయపుడే
హెచ్చగు నానందం బిఁక, నచ్చటరా యెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౬

పిల్లలమఱి బుచ్చనగురుఁ, డుల్లము చల్లఁగను జేసియుంచిన యపుడే
తల్లియుఁ దండ్రియు వారలె, యెల్లప్పుడు నెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౭

బుచ్చనగురుఁడే బ్రహ్మము, నిచ్చలముగ వారిపాదనీరజములకున్
సచ్చరితులు పూజించుట, హెచ్చుటరా యెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౮

బుచ్చనగురుపదవనజము, లిచ్చమెయిం బూజసేయ నిహముం బరమున్
ముచ్చటగనుటవి నీకిఁక, హెచ్చుటరా యెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౯

సుబ్బయగురుకృపవల్లను, నబ్బెను బాలాంబకరుణ యానందముతో
గొబ్బునఁ గైకొని మనుమీ, యిబ్బంగిని నెఱుక గన్న యెఱుఁగుడికన్నా. ౧౦

ఇన్నిదినంబులు గురుపద, మెన్నుచు నీమనసుగోన మెలఁగినయంతన్
జిన్మయసహజానందము, నెన్నఁగ మదిఁ గంటివన్న యెఱుఁగుడికన్నా. ౧౧

ఉంటివి విశ్వము నేనని, కొంటివి గురుపాదవనజకోమలరసమున్
గంటివి చిద్రూపంబును, నింట స్మది యెఱుకగన్న యెఱుఁగుడికన్నా. ౧౨

---

* ఎఱుగుడియనునది, యఱుగుడియని సంజ్ఞావాచకముగాన వాడుచున్నాఁడు.

మనసున వృత్తులు నిలిపిన, నెనయంగాఁ దత్త్వగతిని నెఱుఁగఁగవచ్చుం
దను వలయించుట యేటికి, వినవన్నా యెఱుకగన్న విధమునఁ గన్నా. ౧౩
నేత్రము నాసాపుటములు, శ్రోత్రము నొకచోటఁగూడి సుస్థిరమైనం
బాత్ర మగు నాద మబ్బును, క్షేత్రంబున నెఱుకగన్న శివమగుకన్నా. ౧౪
కన్నులు మూసుక తగనే, తిన్నగఁ దల వంచి మీఁదఁ దిరముగఁ జూడన్
వెన్నెలపోలుపు కనంబడు, నెన్న స్వని నెఱుఁకగన్న యెఱుగుడికన్నా. ౧౫
నాసికము మొదలఁ జిత్తము, భాసిల్లఁగ నుంచి చాల భావము గురుపై
నాసక్తితోడ నిలుపుట, యాసుఖమే నీవటన్న యెఱుగుడికన్నా. ౧౬
నాసికము తుదను మొదలను, భాసిల్లుచు నందుమీఁదఁ బైపైఁజూడన్
ఆనచెడి బయలు కనఁబడు, నాసాబగే బ్రహ్మమన్న యెఱుగుడికన్నా. ౧౭
నాసికము రెండుదిక్కుల, మోసము లేకుండఁబట్టి మూసినయంతన్
గాసిని సుషుమ్న గనఁబడు, నాసరణిని నెఱుకగన్న యెఱుగుడికన్నా. ౧౮
కనుగ్రుడ్డు మధ్యబిందువు, పనుపడ నాచుట్టునున్న ప్రభయే పురుషుం
డనువుగ నీమది నుంచుక, యెనయుర మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.
మనసే శక్తియు నిజముగఁ, గనుఁగొని యాశక్తియందుఁ గాలాంతకునిన్
ఎనయించి ముక్తిగనఁదగు, వినవన్నా యెఱుకగన్న విధమునఁ గన్నా. ౨౦
తనయందు ముక్తియుండఁగ, వినయంబుగ గంగ కేగు విధ మేమిటికో
కనవలె విశ్వము మనమని, యెనయఁగ మది నెఱుకగన్న యెఱుగుడికన్నా.
ఎన్నివిధంబుల నైనను, దన్నే తా నెఱుఁగవలయుఁ దలక్రిందైనన్
మిన్నైన మోక్ష మబ్బును, యెన్నఁగ మదియెఱుక గన్న యెఱుగుడికన్నా.
కన్నుల విడుచుట ముక్తియె, యెన్నఁగ మదిలోన నాన యేర్పడకుండం
దిన్నగ విడుచుట ఫల మది, యెన్నఁగ మది నెఱుకగన్న యెఱుగుడికన్నా.
ముక్తిని గనఁబడనిచ్చునె, యత్తుగ నీయందు నహము నానుకయుండన్
ఎత్తుగ దానిని విడువుమ, యిత్తటి నీ వెఱుకగన్న యెఱుగుడికన్నా. ౨౪
తత్తఱపాటులచే మని, మత్తిల్లుచు నుండఁగా సుమార్గము గనునా
చిత్తము నిలిచినఁ గనఁబడు, నెత్తుగ మది నెఱుకగన్న యినకులకన్నా. ౨౫
ఎత్తటి విశ్వము నా దని, పొత్తుగఁ గూడుండినపుడె పోనఁగదు చిత్తం
బొత్తుగ విడువుమ యంతయు, నిత్తటి మది నెఱుకగన్న యినకులకన్నా.

చిత్తము నే నని యుండకు, తత్తఱపడుదానిఁ గూడి తలఁపుడుగకుమీ
యుత్తమ శాంభవి గనుటది, యెత్తన్నా యెఱుకగన్న యెఱుగుడికన్నా.-౨౭
మత్తేభవృత్తి నుండెడి, చిత్తము గురువంకుసానఁ జిక్కినయపుడే
సత్తును గనఁబడు నంతట, నెత్తటె మది నెఱుకగన్న యెఱుగుడికన్నా.-౨౮
తత్తఱపడుటది వలదిఁకఁ, గుత్తుక మార్గంబు గాను గోమలిపదముల్
అత్తుగాన బ్రహ్మతత్త్వం, బెత్తుగ మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.-౨౯
భ్రూమధ్యంబునఁ బ్రభ గని, యామీఁదను నెల్లచోట్ల నది భావింపన్
స్వామి గురుఁ డాత్మ తా నగు, నీమదిచే నెఱుకగన్న యెఱుగుడికన్నా.౩౦
నాసికము తుదను జూడఁగ, భాసిల్లును బ్రభయుఁ జాల ఫాలాగ్రమునన్
ఆసుఖమునొంది విశ్వము, నీసున దిగనాడవన్న యెఱుగుడికన్నా. ౩౧
నాదముపై బిందువు తగ, నాదరమున వాని మీఁద నాపోజ్యోతిన్
భేదము లేకను గనుటది, యాదిర కృప కెఱుక గన్నయెఱుగుడికన్నా ౩౨
ఒడ్డియాణపుబంధం, బుడ్డాడక నిలిచెనని నుపరతి గనురా
దొడ్డగు మోక్షం బంతట, నడ్డుగు న్నెఱుకగన్న యెఱుగుడికన్నా ౩౩
జాలంధరబంధమ్మును, జాలఁగ బంధించి తేసి సహజంబుగనా
మూలన యుండెడి యమృతముఁ, గ్రోలుదువుర యెఱుకగన్న గురునతకన్నా
బిందువు నేత్రము మధ్యను, బొందుగఁ గూడుండునట్టి పోఁడిమిగనియా
పొందునఁ జిత్తము నిల్పిన, నిందిర నీకబ్బురన్న యెఱుగుడికన్నా. ౩౫
నాదము వే అని చూడకు, మాదరమున నగ్నియందు నమరిన శిఖయే
కాదని నీవెంచిన నది, యేదిర మతియెఱుకగన్న యెఱుగుడికన్నా. ౩౬
నేత్రంబు కళయె పురుషుఁడు, సూత్రంబుగఁ జూచినంత సుస్థిరమతి యా
పాత్రము నీకబ్బినమది, చిత్రంబుగ నెఱుకగన్న శివ మగుకన్నా. ౩౭
చిత్తము నిలిచెడి దరుదని, పొత్తుగ నిహమందుఁ గూడి పొసఁగక నీవున్
ఉత్తమపురుషులఁ గలియుట, యెత్తుర మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.
కాయము నిజ మని యెంచకు, మాయను విహరించి చాల మసలకు నీవుం
గోయుము యరిషడ్వర్గము, నీయనువున నెఱుకకన్న యెఱుగుడికన్నా. ౩౯
ఉంచుము చిత్తము గురుపై, నెంచుము ఓత్సౌఖ్యమందు నేర్పుడఁ దలఁపు
న్నించుము బ్రహ్మానందము, నెంచిన మది యెఱుకగన్న యెఱుగుడికన్నా.